# ఖుర్ఆన్ మరియు సైన్సు




అనువాదం

ముహమ్మద్ జాకిర్ సత్తార్ & బహదూర్

పునర్విమర్శ

ముహమ్మద్ కరీముల్లాహ్

## విషయసూచిక

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం

# పరిచయం

సర్వస్తోత్రములు అల్లాహ్ సుభ్హానహుతాలాకే చెందును

ఏ వ్యక్తి అయినా తను జన్మించిన ఇంటివారు ఆచరించే వ్యవహారాలనే ఆచరించటం సహజం. కాని మనకు ఊహ తెలిసిన తరువాత మనము చేస్తున్న దానిలో ఎంత వరకు సత్యమున్నది అన్నది ఆలోచించాలి. మా తాతముత్తాలు చేస్తున్నారు కాబట్టి నేనూ చేస్తున్నాను అంటే అది సమంజసం కాదు. మనం చేసే ప్రతీ పనిలో మంచిని వెదుకుతాము. అదే వస్తువులైతే మన్నికను, నాణ్యతను వెదుకుతాము. మరి మనం ఆరాధించే దేవుడు ఎవరు అని ఎందుకు తెలుసుకోకూడదు? మరణం తరువాత ఈ జీవితం అంతమై పోతే మరో జీవితం ఉంటుందా, ఉంటే ఏ విధంగా ఉంటుంది? ఈ సృష్టిని సృష్టించిన వాడు ఉన్నాడా? ఉంటే ఆయన ఎవరు? ఎలా ఉంటాడు? ఆయన ఉనికిని తెలియజేయడానికి ప్రవక్తలను పంపాడా? పంపితే వారెవరు? వారిని ఎలా గుర్తించాలి? వారి ద్వారా గ్రంథాలను పంపాడా? పంపితే వాటిని గుర్తించడం ఎలా? అన్న సందేహాలు మనకు కలిగినప్పుడు మన మనస్సు సత్యాన్వేషణను, సంకల్పించు కున్నప్పుడు మనకు సరైన సమాధానం దొరుకుతుంది.

ప్రతి మనిషిలోను దైవభీతి ఉంటుంది. దైవాన్ని ఆరాధించాలనే ఆలోచనా ఉంటుంది. ఈ ఆలోచన మూఢత్వంగా మారకూడదు, మూర్ఖంగా ఉండరాదు. సత్యాన్ని అంగీకరించే ధైర్యం ఉండాలి. అల్లాహ్ పై అపారమైన నమ్మకం కల్గి వుండాలి. కేవలం మనస్సుతోనే కాకుండా మనం ఆరాధిస్తున్న దానిలో ఎంత వరకు నిజం ఉందని మెదడుతోను ఆలోచించాలి. అలా అని వితండవాదం చెయ్యరాదు.

ఆంగ్లములో వ్రాయబడిన A brief Illustrated Guide to Understanding Islam (www.islam-guide.com) పుస్తకం చదివిన తర్వాత ఇటువంటి పుస్తకం తెలుగు పాఠకులకు అందించాలనే ఆలోచన నాకు కల్గింది. ఎందుకంటే దీనిలో చిత్రపఠముల మరియు ప్రముఖుల వ్యాఖ్యానాల ఆధారంగా ఖుర్ఆన్ లో తెలుపబడిన వాస్తవాలను స్పష్టపరచారు. దీనిని స్వచ్ఛమైన మనస్సుతో చదివిన ఏ పాఠకునికి అయిన ఖుర్ఆన్ దైవగ్రంథం అన్న విశ్వాసం కలుగక మానదు.

నిజంగా మీకు సత్యాన్ని గ్రహించే మనస్సు ఉంటే సత్యాన్ని అంగీకరించే హృదయం ఉంటే ఈ చిరుపుస్తకాన్ని సత్యాన్వేషణ దృష్టితో చదవండి. ఖుర్ఆన్ గ్రంథం ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం రచన కాదు. సృష్టికర్త అయినటువంటి అల్లాహ్ గ్రంథం అని మీరు గ్రహిస్తారు. ఇస్లాం ధర్మం దైవధర్మమని ఆ ధర్మాన్ని

అనుసరిస్తే తప్పకుండా మోక్షం లభిస్తుందని గ్రహిస్తారు. అల్లాహ్ మనందరికి సన్మార్గం ప్రాప్తిని కలుగజేయుగాక!

ఈ పుస్తకాన్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన వారందరికీ ఇహపరలోకాలలో గొప్ప సాఫల్య భాగ్యాన్ని సృష్టికర్త అయినటువంటి అల్లాహ్ ప్రసాదించు గాక! ఆమీన్

**మీ సోదరుడు**

**బహదూర్**

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో,

## దివ్యఖుర్ఆన్ గురించి .............

అల్లాహ్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ను తన అంతిమ ప్రవక్తగా ఎంచుకొని, ఆయనకు ఎన్నో అద్భుతాలు, మహిమలు, సాక్ష్యాధారాలు ఇచ్చి సర్వమానవాళికి సన్మార్గం చూపే అంతిమ మార్గదర్శకునిగా చేసాడు. అంతేకాక ఆయన పై ఖుర్ఆన్ అనే మహాద్భుత అంతిమ దివ్య గ్రంథాన్ని కూడా అవతరింపజేసెను. ఆ దివ్యగ్రంథం కల్పితమైంది కాదు. దానిలోని ఎన్నో



దివ్యాద్భుత విషయాలే అందుకు నిదర్శనం. నేడు శాస్త్రవేత్తలు పరిశోధించి తెలియజేసిన, తెలుసుకున్న విషయాలు 1400 సంవత్సరాలకు పూర్వమే నిరక్షరాశి అయిన తన ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం నోట అల్లాహ్ పలికించాడు.

దివ్యఖుర్ఆన్ అల్లాహ్ పంపిన అంతిమ గ్రంథం. ఈ గ్రంథాన్ని ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం పై దైవదూత అయిన జిబ్రాయిల్ అలైహిస్సలాం ద్వారా అవతరింపజేసాడు. ఖుర్ఆన్ 23 సంవత్సరముల పాటు సందర్భాన్ని బట్టి అంచెలంచెలుగా అవతరించింది. జిబ్రాయీల్ అలైహిస్సలాం అనే దైవదూత ద్వారా విన్న ఖుర్ఆన్ ఆయత్ (సూక్తుల) ను ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం కంఠస్థం చేసుకొని, వాటిని తన సహచరులైన సహాబాలకు వినిపించేవారు. సహాబీలలో కొందరిని కాతిబే వహీలుగా నియమించారు. కాతిబే వహీలు అంటే దివ్యవాణి లిఖించేవారని అర్థం. ఖుర్ఆన్ ఆయత్ ల(సూక్తుల)ను వీరు తమకు అందుబాటు ఉన్న జంతు చర్మాలపై, ఖర్జూరపు ఆకులపై వ్రాసుకొని భద్రపరచేవారు. తాము వ్రాసుకున్న ఆయత్ (సూక్తు)లను ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం కు వినిపించేవారు. రమదాన్ మాసంలో, ప్రతి సంవత్సరం ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం జిబ్రయీల్ అలైహిస్సలాం కు ఖుర్ఆన్ వినిపించి, సరిచూసుకునే వారు. తన చివరి సంవత్సరంలో జిబ్రయీల్ అలైహిస్సలాం దూతకు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం రెండుమార్లు వినిపించారు. ఖుర్ఆన్ అవతరించిన నాటి నుండి నేటి వరకు కూడా ఖుర్ఆన్ ను కంఠోపాఠంగా పఠించగలిగేవారు కోట్లలో ఉన్నారు. ఈ ఖుర్ఆన్ గ్రంథాన్ని 10 సంవత్సరాల పిల్లలు కూడా కంఠస్థం చేసి, ఒక్క అక్షరం కూడా పొల్లు పోకుండా పఠించ గలిగేవారు నేటికీ ప్రతిచోటా ఉన్నారు.

ఏ భాషలోనైతే అవతరించిందో అదే భాషలో ప్రపంచం నలుమూలలా ఉన్న ముస్లింలు ఈ ఖుర్ఆన్ ను (అరబీ లోనే) పఠిస్తున్నారు. ప్రపంచవ్యాప్తంగా మరే గ్రంథమూ ఈ విధంగా పఠించబడటం లేదు.

ఈ ఖుర్ఆన్ గ్రంథంలో ఎన్నో వైజ్ఞానిక విషయాలు, ఆర్థిక పరమైన విషయాలు, రాజకీయ అంశాలు, బాధ్యతలు, హక్కులు, స్త్రీపురుషుల సంబంధాలు, బాంధవ్యాలు, జరగబోవు సంఘటనలు, గడచిన వృత్తాంతాలు, ప్రళయదినం నాడు సంభవించే విషయాలు, తీర్పుదినం నాడు ఎదుర్కోబోవు విషయాలు, ప్రళయదినానికి ముందు జరిగే విషయాలు, హెచ్చరికలు, స్వర్గం, నరకం యొక్క విశ్లేషణలు ఇలాంటి మరెన్నో విషయాలతో కూడిన మహోత్తర గ్రంథమే ఈ దివ్యఖుర్ఆన్.

నేడు ఎందరో శాస్త్రవేత్తలు మరెందరో ఆధునిక పరికరాలను ఉపయోగించి తెలుసుకున్న విషయాలను ఓ అక్షరజ్ఞానం లేని నిరక్షరాశి అయిన ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం వారు 1400 సంవత్సరాలకు ముందే తెలియజేశారు. దీన్ని బట్టి ఖుర్ఆన్ మానవ కల్పితం కాదని, ఊహించి వ్రాయబడిన గ్రంథం కాదని, ముమ్మాటికీ ఇది దైవ గ్రంథమని తెలియుచున్నది. మచ్చునకు ఖుర్ఆన్ లో చెప్పబడిన వైజ్ఞానికిపరమైన కొన్ని విషయాలను చూద్దాం.

స్త్రీ గర్భంలో పిండం ఎలా ఏర్పడుతుంది? ఆ తరువాత దశలదశలుగా ఎలా మార్పు చెందుతూ వృద్ధి చెందుతుంది - అనే విషయాల గురించి ఖుర్‌ఆన్ లో చెప్పబడిన విషయాలను నేటి ఆధునిక వైద్యవిజ్ఞానము ద్వారా తెలుసుకున్న విషయాలను పోల్చి చూద్దాం.

## 1. ఖుర్ఆన్ లో మానవసృష్టి గురించి ...

"మేము మానవుణ్ణి మట్టి యొక్క సారంతో సృష్టించాము. తర్వాత అతనిని ఒక సురక్షితమైన స్థానంలో పడే బిందువుగా మార్చాము, ఆ తరువాత ఈ బిందువుకు ముద్ద ఆకారాన్ని ఇచ్చాము, ఆ పైన ముద్దను కండగా చేశాము. తర్వాత మాంసపు కండను ఎముకలుగా చేశాము, ఆ తరువాత ఎముకలకు మాంసాన్ని తొడిగాము, ఆ పైన దానిని భిన్నమైన సృష్టిగా చేసి నిలబెట్టాము. (ఖుర్ఆన్ 23:12– 14)

పై ఖుర్ఆన్ వాక్యాలు 1) బిందువు 2) ముద్ద ఆకారము 3) కండ 4) ఎముకలు 5) ఎముకలపై మాంసం 6) ఆ తరువాత ఓ రూపంగా మారుతుందని మానవ సృష్టి గురించి వివరించాయి. ఇలా ఒక్కో దశ ఒక్కోలా ఉంటుందని ఖుర్ఆన్ తెలియజేసింది. మొదటి దశలోని బిందువు - పురుషుని జననేంద్రియము నుండి వెలువడే బిందువు. అది స్త్రీ పురుషుల కలయిక వలన పురుషుని నుండి వెలువడి స్త్రీ గర్భాశయంలో చేరుతుంది. ఆ తరువాత అది ముద్దగా మారుతుంది.

**మొదటి దశను** సూచించటానికి, ఖుర్ఆన్ లో అలక అనే అరబీ పదము వాడబడింది. అలక అనే పదానికి అరబీ భాషలో మూడు అర్థాలు ఉన్నాయి. వాటిలో ఒక అర్థం జలగ, మరో అర్థం వ్రేలాడుతున్న మరియు మూడవ అర్థం గడ్డకట్టిన. ఇక్కడ మూడు

పటాలు ఇవ్వబడ్డాయి. కాబట్టి ఆ బిందువు పిండంగా మారి క్రమంగా వృద్ధి చెందే విధానాన్ని గనుక జాగ్రత్తగా గమనిస్తే, 1వ పటంలో అది ఓ జలగను పోలినట్లు, 2వ పటంలో అది ప్రేలాడుతున్నట్లు మరియు 3వ పటంలో గడ్డకట్టిన రక్తపు ముద్దలా కనబడును.

తరువాయి పేజీ 5,6 పటాలలో గడ్డకట్టిన రక్తపు కండలా కనిపిస్తుంది. ఈ చిత్ర పటాలను The Developing Human – More and Persaud అను వైద్యవిజ్ఞానానికి సంబంధించిన పుస్తకమును నుండి సేకరించినవి.

స్త్రీ గర్భంలో పిండం 'జలగ మాదిరిగానే రక్తాన్ని పీల్చుతూ వృద్ధి చెందుతుంది' అని, 'ఓ అంచుకు మాత్రమే అతుక్కుని మిగిలిన భాగం ప్రేలాడుతూ ఉంటుంది' అని వైద్యశాస్త్రం కనిపెట్టిన విషయాలు ఖుర్‌ఆన్ లో తెలుపబడిన వాటితో ఎంత ఖచ్చితంగా సరి పోతున్నాయో మీరే గమనించండి.




పటము 1




పటము 2




పటము 3




పటము 4

**రెండవ దశ:** ఖుర్ఆన్ రెండవ దశకు **ముదగ** అనే పేరు ఇచ్చినది. ముదగ అంటే అరబీ భాషలో **మెత్తటి కండ** అని అర్థం. బబుల్ గమ్ ను కాసేపు నమిలి దానిని దవడ పళ్ళ మధ్యన అదిమి ఆ తరువాత బయటకు తీసి చూస్తే అది కనిపించే మెత్తటి కండ ఆకారాన్ని పోలి ఉంటుందని వైద్యశాస్త్రజ్ఞుల పరిశోధనలలో తేలింది. ద్రవంలా కాకుండా **మాంసపు కండలా** ఉంటుంది.

ఈక్రింది చిత్రపటాలు చూడండి.



పటము 5

A. మానవ పిండం






B. నమల బడిన బబుల్ గమ్

పటము 6

కాబట్టి, ఖుర్ఆన్ లో తెలిపిన దానికీ, వైద్యశాస్త్రం పరిశోధించి తెలుసుకున్న దానికీ ఎంత దగ్గరి పోలికలున్నాయో చూడండి.

క్రీ,శ. 1677 సంవత్సరంలో Hamm and Leevewenhock అనే శాస్త్రవేత్తలు మొట్టమొదటిసారిగా పురుషుని ఇంద్రియముపై పరిశోధనలు జరిపి **"పురుషుని నుండి వెలువడే వీర్యబిందువులో మనిషిని పోలిన సూక్ష్మరూపం దాగి ఉంటుందని, అది స్త్రీగర్భాశయంలో చేరిన తర్వాత క్రమంగా వృద్ధి చెంది శిశువు రూపం దాల్చుతుంది"** అనే తప్పుడు సమాచారాన్ని అందించారు. ఇది నిజం కాలేదు. వీరి కంటే 1000 సంవత్సరములకు పూర్వమే ఎలాంటి

పరిశోధనలు చేయకుండానే ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం మానవసృష్టి గురించి ఖచ్చితమైన విషయాలు తెలియజేసారంటే, అది కేవలం దైవానుగ్రహం మాత్రమే అనటంలో ఎలాంటి సందేహం లేదు. ఎందరో ప్రముఖులు దీనిని స్వయంగా ఒప్పుకున్నారు.

Professor Emeritus Keith L.More Embtyology - ఒక ప్రపంచ ప్రసిద్ధ శాస్త్రవేత్త. ఆయన Anatomy Embyology (పిండోత్పత్తి మరియు శరీర నిర్మాణ శాస్త్రము)లలో పరిశోధనలు చేశారు. ఆయన The Developing Human అను గ్రంథమును రచించారు. ఈ గ్రంథం 8 భాషలలో అనువదించబడింది. దీనిపై ఆధారపడి మరెన్నో పరిశోధనలు జరిగాయి. అమెరికాలోని ఓ ప్రత్యేక కమిటీ వారు ఈ పుస్తకానికి వైద్య విద్యారంగములో మొట్టమొదటి స్థానాన్ని కల్పించారు. అంతేకాదు Professor Keith L. Moore కెనడాలోని టోరంటో అను పట్నంలో University of Toronto లో Anatomy Professor గా కూడా పనిచేశారు. అంతే కాక Anatomy విభాగమునకు ఛైర్మన్ గా 8 సంవత్సరముల పాటు తన సేవలను అందించారు మరియు అమెరికా, కెనడాకు చెందిన Association of Anatomists and the council of the union of Biological Sciences కు ముఖ్యసలహాదారునిగా కూడా ఆయన తన సేవలను అందించారు.

1981 సంవత్సరంలో సౌదీ అరేబియాలోని దమ్మామ్ లో జరిగిన 7వ Medical Conference లో Dr. Keith L. Moore

గారు ఇలా వ్యాఖ్యానించారు. "మానవ శరీర నిర్మాణం, అది ఏర్పడే విధానం, అది స్త్రీ గర్భంలో వృద్ధి చెందే విధానం గురించి ఖుర్ఆన్ లో చెప్పిన విషయాలు నేడు అభివృద్ధి చెందిన వైద్య విజ్ఞానం పరిశోధనలు చేసి చెప్పిన విషయాలలో ఎలాంటి వ్యత్యాసం లేదని చెప్పడానికి నేను చాలా సంతోషిస్తున్నాను. కొన్ని వందల సంవత్సరాలకు పూర్వం ఎలాంటి పరిశోధనలు చేయకుండా ఇలాంటి విషయాలను **ముహమ్మద్** చెప్పగలిగారంటే ఇది మామూలు విషయం కాదు. ఆయన **ఖచ్చితంగా సృష్టికర్తయగు అల్లాహ్ యొక్క నిజమైన ప్రవక్తయే మరియు ఖుర్ఆన్ దైవ గ్రంథమే** అనడంలో ఎలాంటి సందేహమూ లేదు." దీనితో అక్కడి సభికులు Dr. Moore గారిని ఇలా ప్రశ్నించారు. "ఏమి, మీరు ఖుర్ఆన్ ను దైవగ్రంథంగా నమ్ముచున్నారా?" అప్పుడు Dr. Moore ఇలా బదులిచ్చారు – "ఎలాంటి అనుమానం లేదు, ఖుర్ఆన్ దైవగ్రంథమే." Dr. Moore ఇంకా ఇదే సభలో – "పిండోత్పత్తి, దాని దశలు తెలియజేసే విధానము గురించి ఖుర్ఆన్ లో మరియు ముహమ్మద్ ఉపదేశాలలో తెలియజేసిన పద్ధతే సరైనది. నేను ఖుర్ఆన్ ను మరియు ముహమ్మద్ ఉపదేశాలను (హదీథ్ లను), ఆయన సహచరులు (సహాబీలు) తెలియజేసిన విషయాలను నేను నాలుగు సంవత్సరాల పాటు చదివాను. వాటిలో నాకు ఎన్నో ఆశ్చర్యకరమైన విషయాలు తెలిసాయి. క్రీ. శ. 6వ శతాబ్దంలోనే పిండోత్పత్తి గురించి ఎంతో ఖచ్చితమైన వివరాలు తెలియజేయబడ్డాయి.

క్రీ.పూ. 4వ శతాబ్దంలో అరిస్టాటిల్ అను శాస్త్రవేత్త కోడిగ్రుడ్డుపై పరిశోధనలు చేసి తెలియజేసిన విషయాలు కూడా అంతంత మాత్రమే. 20వ శతాబ్దం వరకు మానవుని పిండోత్పత్తి గురించి కనిపెట్టినది చాలా తక్కువే అని చెప్పాలి. కాని 6వ శతాబ్ధములోనే ఎలాంటి పరిశోధనలు జరపకుండా సైన్స్ పై ఆధారపడకుండా చెప్పిన విషయాలు గమనించినట్లయితే ఖచ్చితంగా **ఖుర్ఆన్ దైవగ్రంథమే**. ఎందుకంటే ఈ విషయాలు తెలియజేసిన ముహమ్మద్ నిరక్షరాస్యుడు, శాస్త్రీయ పరిజ్ఞానము అంతకంటే లేనివారు. కాబట్టి ఖుర్ఆన్ ఖచ్చితంగా దైవగ్రంథమే" అని ప్రకటించారు.

## 2. ఖుర్ఆన్ లో పర్వతాలను గురించి ...........

దివ్యఖుర్ఆన్ లో అల్లాహ్ ఇలా తెలియజేయుచున్నాడు: "మేము భూమిని పాన్పుగా చేశాము, అందులో పర్వతాలను మేకులుగా పాతాము" ఖుర్ఆన్ 78: 6-7

ఖుర్ఆన్ లో మరోచోట ఇలా తెలుపబడినది: "ఆయన భూమిలో పర్వతాలను మేకులుగా పాతాడు. భూమిపై ఉండే సమస్త జీవకోటి దొర్లిపోకుండా ఉండాలని" ఖుర్ఆన్ 16:15.

ఆధునిక భౌగోళికశాస్త్రం తెలియజేస్తున్నది ఏమిటంటే "పర్వతాలు ఎంత ఎత్తుగా ఉంటాయో అంతకంటే ఎక్కువ రెట్లు భూమిలోనికి దిగబడియుంటాయి" అని తెలియజేస్తుంది.

దీన్ని బట్టి చూసినట్లయితే ఖుర్ఆన్ లోని "పర్వతాలను మేకుల వలే పాతాను" అనే అల్లాహ్ యొక్క ప్రకటన ఎంత ఖచ్చితంగా సరిపోతుందో గమనించండి.

1865 సంవత్సరంలో రాయల్ సర్ జార్జ్ ఎయిరీ అను శాస్త్రవేత్త తన పరిశోధనలతో తెలిసిన విషయాలను తెలియజేస్తూ ఇలా అన్నాడు – "భూమి యొక్క పై పొర కంపించకుండా ఉండటానికి పర్వతాలు చాలా వరకు సహాయపడతాయి."

ఇదే విషయం దివ్యఖుర్ఆన్ లో కూడా చెప్పబడింది. "ఆయన భూమిలో పర్వతాలను మేకులుగా పాతాడు. భూమిపై ఉండే సమస్త జీవకోటి దొర్లిపోకుండా ఉండాలని" ఖుర్ఆన్ 16:15.

కొందరు భౌగోళిక శాస్త్రవేత్తలు పరిశోధనలు జరిపి వారు తెలుసుకున్న విషయాలను ఓ పుస్తకంగా వ్రాసారు. దాని పేరు "ఎర్త్". ఈ పుస్తకాన్ని రచించిన వారిలో ఒకాయన పేరు Prof. Emerities Frank Press ఈయన ఒకనాటి అమెరికా అధ్యక్షుడైన జిమ్మికాటర్ యొక్క సైన్స్ సలహాదారుడిగా పనిచేశారు. తరువాత 12 సంవత్సరముల పాటు నేషనల్ అకాడమీ ఆఫ్ సైన్సెస్, వాషింగ్ టన్ DC కి అధ్యక్షుడిగా కూడా తన సేవలను అందించారు.

ఆ పుస్తకంలో ఇలా వ్రాయబడి ఉంది – "పర్వతాలు భూమిలోనికి చాలా వరకు వేర్లవలే చొచ్చుకునిపోయి, భూమిలో మేకులు పాతినట్లుగా క్రిందకు దిగబడియున్నాయి." అవి ఎలా దిగబడి ఉంటాయి?అనే విషయాన్ని క్రింది 7,8,9 పటాలలో చూడండి




పటము 7




పటము 8




పటము 9

Modern Theory of Plate ఏమని తెలియజేస్తున్న దంటే పర్వతాలు భూమి కంపించకుండా ఉండేందుకు సహకరిస్తూ ఉంటాయి అని. ఈ విషయాలు 1960 సంవత్సరం వరకు ఎవరికి తెలియవు.

మరి ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం 1400 సంవత్సరాలకు పూర్వమే ఖుర్ఆన్ లో ఇలాంటి విషయాలు తెలియజేసారంటే ఇది

ఆయన ద్వారా సర్వలోక సృష్టికర్త తెలిపిన దివ్యజ్ఞానం కాక మరొకటి ఎలా అవుతుందో మీరే నిష్పక్షపాతంగా ఆలోచించండి. పోనీ ఎవరి నుండో విని చెప్పారంటే ఆ కాలంలో నేటిలా ఆధునిక పరికరాలు, ఆధునిక పరిజ్ఞానము అందుబాటులో లేదు అన్నది మనకు తెలుసు. అయినా కొండలు, పర్వతాల అడుగున ఉన్న విషయాలు కూడా ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం తెలిపారంటే ఇది కేవలం సృష్టికర్త అయిన అల్లాహ్ యొక్క కృపయే. దీనిలో ఎటువంటి సందేహమూ లేదు. ఆయన దైవం పంపిన చిట్టచివరి ప్రవక్త అని నమ్మకుండా ఉండటానికి మన ముందు ఇంకే కారణమూ మిగలలేదు.



## 3. ఖుర్ఆన్ లో విశ్వసృష్టి గురించి ...

ఆధునిక విశ్వవిజ్ఞాన శాస్త్రపు పరిశోధనల ప్రకారం ప్రారంభంలో విశ్వమంతా అత్యధిక సాంద్రత మరియు అత్యధిక ఉష్ణోగ్రతతో, పొగ రూపంలోని ఓ మబ్బువలే ఉండేది.

ఈ అభిప్రాయం పై శాస్త్రవేత్తల మధ్య ఎలాంటి అభిప్రాయ భేధం లేదు. మరెన్నో కొత్త కొత్త నక్షత్రాలు ఈ మబ్బు నుండే పుట్టుకు రావటంపై శాస్త్రవేత్తలు పరిశోధనలు జరుపుచున్నారు. ఇప్పుడు మనం చూస్తున్న మెరిసే నక్షత్రాలు ఈ మబ్బు నుండే పుట్టుకు వచ్చినవే. క్రింద చిత్రపటములో చూడండి.

పైన చెప్పబడిన శాస్త్రవేత్తల పరిశోధనలలో తెలిసిన విషయాలు ఖుర్ఆన్ లో చెప్పబడిన విషయాలు ఎంత ఖచ్చితంగా సరిపోతున్నాయో చూడండి.

"కేవలం పొగగా ఉన్న ఆకాశం వైపునకు ఆయన తన ధ్యానాన్ని మరల్చాడు. ఆయన ఆకాశాన్ని, భూమినీ ఉద్దేశించి ఇలా అన్నాడు, "ఉనికిలోనికి రండి, మీకు ఇష్టమైనా, ఇష్టం లేక పోయినా" అవి రెండూ, మేము వచ్చేశాము, విధేయులు మాదిరిగా అని అన్నాయి." (ఖుర్ఆన్ 41:11)

అలా సైన్సు ద్వారా మనకు తెలిసినందేమంటే ఆకాశము, భూమి మొత్తం (సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, గ్రహాలు,

పాలపుంతలు) అన్నీ ఒకేచోట ఉండేవని మరియు సర్వ రసాయనాలు అన్ని మిళితమై ఉండేవని ఓ విస్ఫోటం ద్వారా అవి వేరు వేరు అయినాయని సైన్స్ చెబుతుంది.

మరి ఖుర్‌ఆన్ ఏమి చెబుతుందో చూద్దాం - "తిరస్కరించిన వారు ఈ విషయాలను గురించి ఆలోచించరా, ఆకాశాలు, భూమీ పరస్పరం కలిసి ఉండేవనీ, తర్వాత మేము వాటిని వేరు చేశామనీ" (ఖుర్‌ఆన్ 21:30)



పటము 10



పటము 11

Dr. Alfred Kroner ఈయన ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన Geology శాస్త్రవేత్త. ఈయన Institute of Geosciences మరియు Johannes Gutenber University, Mainz, Germanyలో ప్రధాన అధికారిగా, ప్రొఫెసర్ గా తన సేవలను అందించారు.

ఈయన ఒక సందర్భంలో ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం వారి గురించి ఈ విధంగా వ్యాఖ్యానించారు.

"ముహమ్మద్ ఎవరు, ఈయన ఎక్కడి నుండి వచ్చారు, ఇంత పరిజ్ఞానం ఈయనకు ఎక్కడిది, ఎందరో శాస్త్రవేత్తలు, మరెన్నో

ఆధునిక పరికరాలు ఉపయోగించి, శ్రమించి తెలుసుకున్న విషయాలను ఎలాంటి పరికరాలు అందుబాటులో లేని సమయంలో ఎలాంటి పరికరాలను వినియోగించకుండా 1400 సంవత్సరాలకు పూర్వం ఓ అక్షరజ్ఞానం లేని వ్యక్తి ఎలా చెప్పగలిగారు, ఇలాంటి విషయాలు అణు పరిజ్ఞానము ఉన్నవారే చెప్పగలరు, మరి ఈయన ఎలా చెప్పగలిగారు?"

## 4. ఖుర్ఆన్ లో మెదడు గురించి ...

దివ్యఖుర్ఆన్ లో సర్వలోక సృష్టికర్త అయిన అల్లాహ్ ఓ దుష్టుడిని ఉద్దేశించి ఈ విధంగా ప్రకటించెను: “అతడు గనక మానకపోతే మేము అతన్ని అతని నుదుటి వెంట్రుకలు పట్టుకుని ఈడుస్తాము, అబద్ధానికి, ఘోరపాపానికి పాల్పడిన నుదురు అది” (ఖుర్ఆన్ 96:15-16)

పైన ఖుర్ఆన్ లో చెప్పబడిన **అబద్ధానికి, ఘోరపాపానికి పాల్పడిన నుదురు** అన్నమాటలు నేడు వైద్య విజ్ఞానము ద్వారా తెలిసిన విషయాలు ఎంత దగ్గరగా ఉన్నాయో చూడండి.

Essential of Anatomy & Physiology అను పుస్తకంలో ఈ విధముగా వ్రాయబడింది. నుదురు వైపు ఉన్న మెదడు భాగాన్ని Pre Frontal Area అంటారు. మెదడులోని ఈ భాగమే మనిషి ఏదైనా మంచి చెడు పనులు చెయ్యాలనే ఆలోచన కలుగజేస్తుందని వాటిని ఆచరించే వైపునకు పురిగొల్పుతుందని, ఉద్రేకాన్ని కల్గించే కేంద్రం కూడా ఇదే. సత్యం లేదా అసత్యపు మాటలాడటానికి వాటిని ఆచరణలో పెట్టే విధంగా శరీరంలో మిగతా భాగాలను పురుగొల్పుతుంది అని ఈ Pre Frontal Area పనిచేసే విధానమును ఇటీవలనే Professor Keith L. Moore అనే శాస్త్రవేత్త కనిపెట్టెను.

ఒక దుష్టుడైన అవిశ్వాసి ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ను తరుచూ ఇబ్బందులకు గురిచేసేవాడు. వాడి బుర్రలో ఎప్పుడూ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ను ఎలా కించపరచాలి, ఆయన సత్యధర్మప్రచారాన్ని ఎలా ఆటంకపరచాలి అనే ఆలోచన తప్ప మరొకటి ఉండేది కాదు. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం వారు మసీదుకు వెళ్ళే త్రోవలో ముళ్ళకంపలు పరిచేవాడు. ఆయన ప్రార్థిస్తూ ఉండగా వీపుపై ఒంటె బోటి ప్రేగులు వేసేవాడు. ఇసుక గుమ్మరించేవాడు. ఇలాంటి వాడి గురించే ఖుర్ఆన్ **అబద్ధాన్ని, ఘోరానికి పాల్పడిన నుదురు వాడిది అందుచేతనే నుదుటి వెంట్రుకలను పట్టి ఈడ్చుకుంటూ పోయి నరకంలో వేస్తానని** హెచ్చరించడం జరిగింది. అంటే వీరికి అలాంటి చెడు ఆలోచనలు, ప్రణాళికలు కల్గించేది ఈ స్థానమే అని ఖుర్ఆన్ చెబుతుంది. నేడు వైద్య విజ్ఞానము ఈ స్థానమే ఇలాంటి వాటికి కేంద్రబిందువు అని చెబుతుంది.

క్రింది పేజీలో Essentials of Anatomy Physiology అను పుస్తకము నుండి సేకరించిన మెదడులోని వివిధ భాగాలను సూచిస్తున్న చిత్రపటమును చూడండి.

## 5. ఖుర్ఆన్ లో సముద్రాలు నదుల సంగమం గురించి.

రెండు సముద్రాలు కలిసే చోట వాటి మధ్య ఓ తెర ఏర్పడు తుంది. ఈ తెర రెండు సముద్రాల నీరు ఒకదానిలో మరొకదాని నీరు కలవకుండా అడ్డుకుంటుంది.ఇది ఎలా తెలుస్తుందంటే,ఓ సముద్రపు నీటిలో ఉండే రుచి (ఉప్పదనం) గాని సాంద్రత గాని ఉష్ణోగ్రతలో గాని మరో సముద్రపు నీటిని పోలి ఉండదు. దీన్ని బట్టి రెండు సముద్రాల నీరు ఒకదానిలో మరొకటి కలుస్తున్నాయా లేదా అన్నది తెలుస్తుంది. రెండు సముద్రాలు కలిసే ప్రదేశములో జరిపిన పరిశోధనల ఆధారంగా రెండు సముద్రాల నీరు కలవవని వాటి మధ్యలో ఒక తెర ఉంటుందని ఆధునిక విజ్ఞానము తెలియజేస్తుంది.

ఉదా.మెడిటేరియన్ సముద్రం యొక్క నీరు అట్లాంటిక్ మహా సముద్రపు నీటి కంటే సాంద్రత, ఉప్పదనం, ఉష్ణోగ్రత ఎక్కువ. మెడిటేరియన్ సముద్రం Gibralter ప్రాంతంలో అట్లాంటిక్ మహా సముద్రంలో కలుస్తుంది. అలా కలిసి కొన్ని వందల కిలోమీటర్ల దూరం వరకు అట్లాంటిక్ మహా సముద్రంలో ప్రవహిస్తుంది. ఇది దాదాపు 1000 మీటర్ల లోతు వరకు వెళుతుంది. అయినా మెడిటేరియన్ సముద్రపు నీటి యొక్క ఉష్ణోగ్రతలలో గాని, రుచిలో గాని, సాంద్రతలో గాని ఎలాంటి మార్పు కలగదు. సముద్రపు ఆటుపోట్లు వలన గాని పెద్ద పెద్ద కెరటాల వలన గాని సముద్రపు లోతులలో ఏర్పడే కరెంటు వలన గాని ఈ తెర చెక్కు చెదరదు.

ఇదే విషయం ఖుర్ఆన్ లో ఇలా చెప్పబడింది. "రెండు సముద్రాలు ఒకదానితో ఒకటి కలిసి పోయేటందుకు ఆయన (అల్లాహ్) వాటిని వదిలిపెట్టాడు. అయినా వాటి మధ్య ఒక తెర అడ్డంగా ఉన్నది. అవి దానిని అతిక్రమించవు" (ఖుర్ఆన్ 55: 19 – 20)

మెడిటేరియన్ సముద్రం అట్లాంటిక్ మహా సముద్రంలో కలిసే విధానాన్ని ఈ క్రింది చిత్రపఠములో చూడండి. ఇది Marine Geological Kuenen నుండి సేకరించబడినది.




పటము 13

అలాగే నదులు సముద్రంలో కలిసే చోట కూడా ఒకదానిలో మరొకటి కలువవు.దాని గురించి కూడా ఖుర్ఆన్ లో చెప్పబడింది. "రెండు సముద్రాలనూ కలిపి ఉంచినవాడు ఆయనే. ఒకటేమో రుచికరమైనది, మధురమైనదీను. రెండోది చేదైనది, ఉప్పైనదీను. ఆ రెంటి మధ్య ఒక తెర అడ్డంగా ఉన్నది. అది వాటిని కలసిపోకుండా ఆపి ఉంచే అవరోధం" (ఖుర్ఆన్ 25:53)

ఖుర్ఆన్ లో ఒక సముద్రపు నీరు మరో సముద్రపు నీటిలో కలుపకుండా ఓ తెర అడ్డంగా ఉన్నది అని తెలియజేయబడినది. అదే విషయాన్ని ఆధునిక విజ్ఞానము ధృవపరుస్తుంది. ఈ క్రింద ఇవ్వబడిన చిత్రపటమును గమనించండి.




పటము 14

## 6. ఖుర్ఆన్ లో లోతైన సముద్రపు పరిస్థితి & అలల గురించి ...

"లేదా వారి కర్మలకు ఒక లోతైన సముద్రంలోని చీకటిని ఉపమానంగా చెప్పవచ్చు. దాని (ఆ చీకటి) పై ఒక అల వ్యాపించి ఉన్నది. దానిపై మరొక అల, దానిపై మేఘం, చీకటి పై చీకటి. మనిషి తన చేతిని బయటకు చాచితే, దానిని కూడా చూడలేడు. ఎవరికి అల్లాహ్ తన వెలుగును ప్రసాదించడో, అతనికి మరే వెలుగూ లేదు." (ఖుర్ఆన్ 24:40)

ఆధునిక విజ్ఞానం తెలియజేస్తున్నది ఏమిటంటే సముద్రపు లోతులలో 200 మీటర్ల తరువాత చిమ్మచీకటిగా ఉంటుందని అదే 1000 మీటర్ల లోతులో అయితే అసలు వెలుగు ఛాయలు కూడా ఉండవని తేలింది. మానవమాత్రులు కేవలం 40 మీటర్ల వరకే ఏ పరికరాల సహాయం లేకుండా వెళ్ళగలడు. అంతకు మించి లోతులో వెళ్ళాలంటే దానికి సంబంధించిన పరికరాల సహాయంతో వెళ్ళాలి. ఒకవేళ ఎవరైనా 40 మీటర్లకు మించి లోతులోకి పరికరాలు లేకుండా వెళ్ళినా బ్రతికి బయటకు రాలేడు. అలానే బయట మనకు కలిపించే కెరటాల వలే అడుగున కూడా కెరటాలు వస్తాయని కనుగొన్నారు. నేడు మానవుడు జలాంతర్గాముల సహాయముతో సముద్రపు లోతులలో ప్రయాణిస్తున్నాడు. దేశ రక్షణలో ఇవి ఎంతో కీలకపాత్రను పోషిస్తున్నాయి. అలా మానవుడు సముద్రపు లోతుల

లోనికి వెళ్ళబట్టి ఈ విషయాలను కూడా తెలుసుకోగలిగాడు. మరి 1400 సంవత్సరాలకు పూర్వం ఎలాంటి పరికరాలు అందుబాటులో లేకపోయినా సముద్రపు లోతులోనికి వెళ్ళకుండా లోపల చీకటిగా ఉంటుందని, తన స్వంత చేయి తనకే కనబడనంత చీకటిగా ఉంటుందని సముద్రపులోతులలో కూడా అలలు వస్తాయని అవి మేఘం వలె కమ్ముకొని ఉంటాయని ఎలా తెలియజేయగలిగారు అనే విషయం ఒక్కసారి ఆలోచించండి.

దీన్ని బట్టి ఖుర్ఆన్ అల్లాహ్ యొక్క గ్రంథమని, ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం అల్లాహ్ యొక్క ప్రవక్త, కాబట్టి ఇలాంటి విషయాలు చెప్పగలిగారని రుజువగుచున్నది.

ఏమి, ఇప్పటికైనా సృష్టికర్త అల్లాహ్ ఒక్కడే దేవుడని ఖుర్ఆన్ ఆయన పంపిన గ్రంథమని ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఆయన యొక్క ప్రవక్త అనే విషయాన్ని విశ్వసించడానికి మిమ్ములను ఏ విషయం ఆపివేసింది?

సముద్రపు లోతులలో ఉండే చీకటి తెరలు మరియు అలలు ఉండే విధానాన్ని తెలియజేసే పటాలను ఈ క్రింద చూడండి.

## 7. ఖుర్ఆన్ లో వర్షపు మబ్బుల గురించి ...

మనకు కనిపించే మబ్బులన్నీ వర్షపు మబ్బులు కావు. అవి ఒక పద్ధతి ప్రకారం దశలవారిగా ఒక ఆకారంగా ఏర్పడతాయి.

ఈ రకమైన మబ్బులను శాస్త్రవేత్తలు cumulonimbus clouds అని పిలుస్తారు. శాస్త్రవేత్తలు ఈ cumulonimbus మేఘాలు ఎలా ఏర్పడతాయో అన్న విషయంపై పరిశోధించి తెలుసుకున్న విషయాలు ఏమిటంటే ఈ మబ్బులు మూడు దశలుగా పరివర్తనం చెందిన తరువాత వర్షం పడుతుందని తెలుసుకున్నారు.




పటము 17

**మొదటి దశ:** చిన్న చిన్న మబ్బు తునకలు గాలికి నలువైపుల నుండి కొట్టుకుంటూ వచ్చి ఒకచోట చేరతాయి. ఇలా ఏర్పడే విధానమును ఈ ప్రక్క చిత్రపటములో చూడండి.



పటము 18

**రెండవ దశ:** ఇలా కొట్టుకుంటూ వచ్చిన మబ్బుతునకలు ఒక పెద్ద మబ్బుగా ఏర్పడుతుంది. ఇలా ఏర్పడే విధానమును ఈ క్రింది పటములో చూడండి.




పటము 19

**మూడవ దశ:** అలా ఏర్పడిన మబ్బు పెద్ద దిబ్బ(పుట్ట) వలే పైకి పైకి ఎదుగుతుంది. ఇలా పైకి ఎదిగిన మబ్బులోని నీటి బిందువులు వడ గండ్లుగా మారును. అవి మరింత చల్లని వాతావరణంలోనికి వెళ్ళే కొద్దీ అందులో ఉండే నీటి బిందువులు వడగండ్లు పెద్దవిగా మారును.




ఇలా ఏర్పడిన వడగండ్లు నీటి బిందువు బరువెక్కి ఆ మబ్బు మరీ పైకి వెళ్ళలేక అందులో ఉన్న నీరు వడగండ్లు క్రిందికి రాలిపోతాయి. ఇలా వర్షం ఏర్పడుతుందని శాస్త్రవేత్తలు పరిశోధనలు చేసి తెలుసుకున్నారు. మరి ఎలాంటి పరిశోధనలు చేయకుండా ఖుర్ఆన్ లో చెప్పబడిన విషయాలను ఒకసారి చూడండి. "అల్లాహ్ మేఘాన్ని మెల్లమెల్లగా నడపటాన్ని దాని తునకలను ఒకదానితో ఒకటి కలపటాన్ని తరువాత దానిని పోగుచేసి ఒక దట్టమైన మబ్బుగా మలవటాన్నీ నీవు చూడవా? తరువాత దానిపై పొర

నుండి వర్షపు చినుకులు రాలుతూ ఉండటాన్ని నీవు చూస్తావు. ఆయన ఆకాశం నుండి దానిలోని ఎత్తైన పర్వతాలు కారణంగా, వడగండ్లను కురిపిస్తాడు" (ఖుర్ఆన్ 24:43-44).

పైన చెప్పబడిన ఖుర్ఆన్ లోని విషయాలు మరియు శాస్త్రవేత్తలు పరిశోధించి తెలియజేసిన విషయాలు ఒకేలా ఉన్నాయి. మేఘాలను నడవటం, ఒక దగ్గర పోగవటం, దట్టమైన మబ్బుగా మారటం ఇలా ఖుర్ఆన్ లోని విషయాలు మరియు శాస్త్రవేత్తలు చెప్పిన విషయాలు ఎంత దగ్గరగా ఉన్నాయో గమనించండి. బెలూన్లు, విమానాలు, శాటిలైట్లు, ఇంకా మరెన్నో వాతావరణంలో తేమ, దాని హెచ్చుతగ్గులు కొలిచే పరికరాలు మరియు వాతావరణం లోని పీడనం గురించి తెలుసుకునే పరికరాలు ఉపయోగించి శాస్త్రవేత్తలు తెలియజేశారు. మరి ఎలాంటి పరిశోధనలు చేయకుండా ఓ అక్షరజ్ఞానం లేని వ్యక్తి ఇలాంటి విషయాలు చెప్పారంటే ఈయన దైవప్రవక్తని ఖచ్చితంగా చెప్పవచ్చు.

ఇక వడగండ్లను గురించి ఉరుములు, మెరుపులు, పిడుగులు గురించి శాస్త్రవేత్తలు ఏమంటున్నారో చూసే ముందు ఖుర్ఆన్ ఏమంటుందో చూద్దాం. "ఆయన ఆకాశం నుండి, దానిలోని ఎత్తైన పర్వతాలు కారణంగా, వడగండ్లను కురిపిస్తాడు. తాను తలచిన వారికి వాటి ద్వారా నష్టం కలిగిస్తాడు. తాను తలచిన వారిని

వాటి నుండి రక్షిస్తాడు. దాని పిడుగు యొక్క మెరుపు చూపులను చెదరగొడుతుంది" (ఖుర్ఆన్ 24:43-44).

శాస్త్రవేత్తలు తెలుసుకున్నది ఏమిటంటే cumulonimbus clouds (మబ్బులు) 25,000 నుండి 30,000 అడుగుల ఎత్తు ఎదిగి,



పటము 21

పెద్ద శిఖరాల వలే ఏర్పడ తాయని ఇలా ఏర్పడిన మబ్బు లోనే వడగండ్లు కురుస్తాయి. ఇదే విషయాన్ని ఖుర్ఆన్ ఇలా తెలియజేసింది. "ఎత్తైన పర్వతాలు కారణంగా అంటే పర్వతాల్లాంటి మేఘాల నుండి వడగండ్లు కురుస్తాయి". Meteorology Today అనే పుస్తకంలో ఇలా వ్రాయబడింది. "మబ్బులోని అతి శీతల ద్రవ బిందువులు, వడగండ్ల తునకలు ఒకదానితో ఒకటి గుద్దుకున్న సమయంలో అవి ఒక్కసారి గడ్డకడతాయి. ఈ చర్య వలన వాటిలో తీవ్రమైన వేడి పుడుతుంది. ఇలా వేడెక్కిన బిందువులు క్రిందకు

జారతాయి. ఇలా జారిపడే బిందువు మబ్బు క్రింద భాగంలో ఉన్న మంచు తునకలతో కలుస్తాయి. మబ్బు పై భాగంలో వేడెక్కిన వడగండ్లు మబ్బు క్రింద భాగములో మంచు తునక కలిసినప్పుడు వడగండ్లలో రుణ విద్యుత్ (Negative) జనిస్తుంది. అలా వేడెక్కిన వడగండ్లతో మంచు కణాలు కలిసినప్పుడు మంచుకణాలలో ధన విద్యుత్ (Positive) ఏర్పడుతుంది. ఇలా జనించిన Positive మరియు Negative విద్యుత్ కలయిక వలనే మెరుపులు ఉరుములు ఏర్పడతాయి". ఆధునిక విజ్ఞానశాస్త్రం తెలియజేస్తున్న



ఈ విషయాలతో 1400 సంవత్సరముల పూర్వమే పర్వతాల్లాంటి మబ్బులలో నుండి వడగండ్లను కురిపిస్తాడని, అందులో నుండి పిడుగులు కురిపిస్తాడని ఖుర్ఆన్ లో చెప్పబడిన విషయాలు ఎంత సరిగ్గా సరిపోతున్నాయో చూడండి. ఖుర్ఆన్ ఎంత ఖచ్చితమైన సమాచారాన్ని అందించిందో వీటిని బట్టి అర్థం అవుతుంది. కాబట్టి ఇది నూటికి నూరుపాళ్ళు దైవగ్రంథమే అనటంలో ఇక ఎలాంటి సందేహానికీ తావు లేదు.

## 8. ఖుర్ఆన్ లో పెళ్ళి కొరకు నిషేధించబడిన స్త్రీలు ..

"మీకు ఈ స్త్రీలు (హరామ్) నిషేధించబడ్డారు - మీ తల్లులు, మీ కుమార్తెలు, మీ సోదరీమణులు, మీ మేనత్తలు, మీ తల్లి సోదరీమణులు (పినతల్లులు) మీ సోదరుల కుమార్తెలు, మేనకోడళ్ళు మీకు పాలిచ్చిన తల్లులు, మీతో పాటు పాలు త్రాగిన సోదరీమణులు, మీ భార్యల తల్లులు, మీ సంరక్షణలో పెరిగిన మీ భార్యల కుమార్తెలు అంటే మీరు రమించిన భార్యల కుమార్తెలు అయితే ఒకవేళ (వివాహం మాత్రమే అయి) రమించటం జరిగి ఉండకపోతే (వారికి విడాకులిచ్చి, వారి కుమార్తెలను వివాహమాడటం) మీకు దోషం కాదు. మీ వెన్ను నుండి పుట్టిన మీ కుమారుల భార్యలు, ఇంకా ఏక కాలంలో అక్కాచెల్లెళ్ళు ఇద్దరినీ చేర్చి భార్యలుగా చేసుకోవటం కూడా నిషిద్ధమే. పూర్వం జరిగిందేదో జరిగిపోయింది. అల్లాహ్ క్షమించేవాడూ, కరుణించేవాడూను." (ఖుర్ఆన్ 4:23)

వైద్యశాస్త్రం కూడా మేనరికం చెయ్యరాదని (అంటే అక్క కుమార్తెను వివాహం) చేసుకోవటం వలన అనేక సమస్యలు వస్తాయని చెప్పడం జరిగింది. ఇదే విషయాన్ని ఖుర్ఆన్ లో 1400 సంవత్సరాలకు పూర్వమే చెప్పబడింది. ఇప్పుడు శాస్త్రీయపరంగా పరిశీలిద్దాం. క్రీ.శ. 1665 సంవత్సరంలో రాబర్ట్ హుక్ అను శాస్త్రజ్ఞుడు

జీవరాశుల శరీరము అనేక గ్రంధులు వంటి కణములతో నిర్మింపబడి ఉంటాయని కనుకొన్నాడు.

17వ శతాబ్దం లో ఆ పెన్ హుక్ అనే శాస్త్రజ్ఞుడు ఆ కణం యొక్క కేంద్రాన్ని గుర్తించాడు. వీటి ఆధారంగా మొదటి జంతువులపై, పక్షులపై పరిశీలించడం ప్రారంభించారు.

క్రోమోజోమ్ పై మాత్రం 19వ శతాబ్దంలో పరిశోధనలు ప్రారంభమైనాయి. వాటిని బట్టే అనువంశీకత గూర్చి తెలుసు కున్నారు. తల్లితండ్రుల లక్షణాలు, వారి పూర్వీకుల లక్షణాలు, సంతానానికి రావడమనేది నిర్ధారించారు. వీటన్నింటికి కారణం జన్యు సంబంధమేనని తెలుసుకున్నారు. ఈ జన్యువు డి- ఆక్సిరైబో కేంద్ర కామ్లము ఏర్పడి తల్లిదండ్రుల బీజ కణముల ద్వారా జన్యువులు సంతానానికి సంక్రమిస్తాయి.

అంతర్గత జన్యువులు వలన (అంటే రక్తసంబంధీకుల, పాలసంబంధీకుల గురించి ఖుర్ఆన్ లో తెలుపబడినట్లుగా) అసాధారణమైన, ప్రాణాంతకమైన అంతర్గత హానికర లక్షణాలు ఏర్పడి, సంతానానికి సంక్రమించే ఆస్కారం ప్రతి నూరు మందిలో 99 మందికి ఉంటుంది. కాబట్టి శాస్త్రీయపరంగా మేనకోడళ్ళను (అక్కకూతురు) ని వివాహమాడరాదు అని నిర్ధారించింది. (Science & Technology B.A.)

## 9. ఖుర్ఆన్ వచనాల వంటి వచనాలు తేగలరా?

ఖుర్ఆన్ మాత్రమే ఈ సవాలును విసురుతున్నది. మరే గ్రంథంలోనూ ఇలాంటి సవాలు కనబడదు.

“మేము మా దాసునిపై అవతరింపజేసిన గ్రంథం గురించి, అది మా గ్రంథం అవునో కాదో అని మీకు సందేహం ఉన్నట్లయితే దాని వంటి ఒక్క అధ్యాయాన్నైనా మీరు రచించి తీసుకురండి. మీ సహచరులందరినీ పిలుచుకోండి. ఒక్క అల్లాహ్ తప్ప మరెవరి సహాయాన్నైనా పొందండి. మీరు సత్యవంతులే అయితే ఈ పని చేసి చూపించండి. కాని మీరు అలా చెయ్యకపోతే నిశ్చయంగా ఎన్నటికీ చెయ్యలేరు. భయపడండి, మానవులు రాళ్ళు ఇంధనం కాగల ఆ అగ్నికి, అది సత్యతిరస్కారుల కొరకు తయారు చెయ్యబడింది.” (ఖుర్ఆన్ 2:23-24)

ఖుర్ఆన్ అవతరించిన కాలంలో ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లంను వ్యతిరేకించే వారిలో ఎందరో ముస్లిమేతర కవులు, అరబీ భాషలో ఎంతో ప్రావీణ్యము ఉన్నవారు కూడా **నిస్సందేహంగా ఇది దైవగ్రంథమే** అని అంగీకరించారు. ఇందులో భావాన్ని వ్యక్తపరిచే విధానం, ఇందులో తెలియజేస్తున్న విషయాలు అక్షరాల కూర్పు, పదాల ఉచ్చారణ, అందులోని మాధుర్యం, ఇందులో సృష్టిలో ఏ అంశాన్ని కూడ వదలకుండా తెలియజేసే విధానం - ఇది ఓ కవి

ఊహ సృష్టికాదు. పూర్వపు గ్రంథాలలోని విషయాలను చదివి వాటిలోనివి క్రోడీకరించి వ్రాయుటకు ఆయనకు చదవడం రాదు. ఏ పండితుల దగ్గరకు వెళ్ళి చదువునేర్చుకున్నట్లు ఏ ఆధారాలు లేవు. ఎందుకంటే పూర్వపు గ్రంథాలలో కూడా ఈ ప్రవక్త రాకడ ఆయన జీవనశైలి మరియు రూపు, ఆకారం, ప్రవర్తన మొదలగునవి చెప్పబడ్డాయి. ఈ క్రింది గ్రంథాలలో గల కొన్ని ఉదాహరణలు పరిశీలనా బుద్ధితో గమనించండి.

## బైబిల్ లో ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం రాక గురించి

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం వారి గురించి బైబిల్ లోనే కాదు వేదాలలో కూడ చెప్పబడినట్లు ఆధారాలు ఉన్నాయి. లింగస్పెది. శిఖామణి, ఉత్తరమాది, కల్కి అవతార్, మహమదా, మహాఋషి ఇక బైబిల్ విషయానికి వస్తే ఒకచోట ఇలా చెప్పబడింది. మూసా అలైహిస్సలాం నాలాంటి ప్రవక్త మీ వద్దకు రాబోతున్నాడని తెలియజేశారు. మూసా ప్రవక్తకు మరియు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం వారికి చాలా దగ్గర పోలికలు ఉన్నాయి. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం వలే మూసా అలైహిస్సలాంను కూడా ఆయన సహచరులు దైవప్రవక్తగానే విశ్వసించేవారు. అలానే ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం తాను జన్మించిన మక్కా నుండి మదీనాకు వలస వెళ్ళారు, వివాహాలు చేసుకున్నారు. పిల్లలు కూడా ఉన్నారు. యుద్ధాలు కూడా చేశారు. ప్రజలు వారిని ప్రళయం వరకు కూడా

ప్రవక్తగానే విశ్వసిస్తారు. ఏ విధంగానైతే మూసా అలైహిస్సలాం చేసారో అదే విధంగా ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం కూడా చేసారు. ఈ ఆధారాలను బట్టి ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం వారు మూసా వంటి ప్రవక్త అని అర్థం అవుతుంది.

బైబిల్ లో ఇలా చెప్పబడినది –

**మోషే వంటి ప్రవక్త:** పాతనిబంధన (ద్వితియోపదేశకాండం 18:18)- వారి సహోదరులలో నుండి నీ వంటి ప్రవక్తను వారి కొరకు పుట్టించెదను. అతని నోట నా మాటల నుంచుదును. నేను అతని కాజ్ఞాపించునది యావత్తును అతడు వారితో చెప్పును.

**యోహాను 16:13** ఆయన సత్యములోనికి నడిపించును.

**వ్యాఖ్యానం:** ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం సిరాతె ముస్తఖీమ్ అనగా తిన్నటి దారి సత్యమైన స్వర్గం వైపునకు తీసుకువెళ్ళే దారి వైపు ఆహ్వానించిరి.

**యోహాను 16:14** ఆయన తనంతట తానేయేమియూ బోధింపక వేటిని వినునో వాటినే బోధించి సంభవించపబోవు సంగతులను మీకు తెలియజేయును.

**వ్యాఖ్యానం:** ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం తనంతట తాను ఏదియు బోధింపక దైవవాణి (వహీ) ద్వారా ఏ విషయాలైతే

అవతరిస్తాయో వాటినే ప్రపంచ ప్రజలకు బోధించిరి (ఖుర్ఆన్). ఇంకా సంభవించబోవు అనేక సంగతులు కూడా ఖచ్చితంగా తెలిపిరి.

**ఉదాహరణ:** నా తరువాత రెండవరాకడ ఏసు వారు వస్తారు. ఆయన నా షరిఅహ్ (ఇస్లాం) ధర్మం ప్రకారం ముస్లిమై ఉండి, ప్రజలకు ఇస్లాం ధర్మప్రచారం చేస్తారు. ఆయన 40 సంవత్సరాలు రాజ్యమేలుదురు మొదలగునవి.

**యోహాను 16:1-11** – మీరు అభ్యంతరపడకుండవలెనని యీ మాటలు మీతో చెప్పుచున్నాను. వారు మిమ్ములను సమాజ మందిరములలో నుండి వెలివేయుదురు; మిమ్ములను చంపు ప్రతి వాడు తాను దేవునికి సేవ చేయుచున్నానని అనుకొను కాలము వచ్చుచున్నది. వారు తండ్రిని నన్ను తెలిసికొనలేదు గనుగ ఈలాగు చేయుదురు. అవి జరుగుకాలము వచ్చినప్పుడు నేను వాటిని గూర్చి మీతో చెప్పితినని మీరు జ్ఞాపకము చేసికొనులాగున యీ సంగతులు మీతో చెప్పుచున్నాను; నేను మీతో కూడా ఉంటిని గనుక మొదటనే వీటిని మీతో చెప్పలేదు, ఇప్పుడు నన్ను పంపినవాని యొద్దకు వెళ్ళుచున్నాను – నీవు ఎక్కడికి వెళ్ళుచున్నావని మీలో ఎవడును నన్నడుగుట లేదు గాని నేను ఈ సంగతులు మీతో చెప్పినందున మీ హృదయము దు:ఖముతో నిండియున్నది. అయితే నేను మీతో సత్యము చెప్పుచున్నాను, నేను వెళ్ళిపోవుట వలన మీకు ప్రయోజనకరము; నేను వెళ్ళని యెడల ఆదరణకర్త మీ యొద్దకు

రాడు; నేను వెళ్ళిన యెడల ఆయనను మీ యొద్దకు పంపుదును. ఆయన వచ్చి, పాపమును గూర్చియు నీతిని గూర్చియు తీర్పును గూర్చియు లోకమును ఒప్పుకొనజేయును. లోకులు నా యందు విశ్వాసముంచలేదు గనుక పాపమును గూర్చియు, నేను తండ్రి యొద్దకు వెళ్ళుటవలన మీరిక నన్ను చూడరు గనుక నీతిని గూర్చియు, ఈ లోకాధికారి తీర్పు పొందియున్నాడు. గనుక తీర్పును గూర్చియు ఒప్పుకొనజేయును.

**వ్యాఖ్యానం**: ఏసు వారు తన శిష్యులతో ఈ విధంగా చెప్పుచున్నారు. "మీరు ఇక నుండి ఈ విషయములు గ్రహింతురు. అవి మిమ్ములను జనులు హింసించెదరు. కష్టములు పెట్టుదురు. మీ ప్రార్థనా మందిరములలో నుండి మిమ్ములను వెళ్ళగొట్టెదరు. మిమ్ములను చంపుదురు. ఇవన్నీ ఎందుకనగా మీరు ప్రకటించే ప్రకటనలు దేవుని ఏకత్వం మరియు నేను ఒక ప్రవక్త, ఒక మార్గదర్శకుడుని మీరు వారికి బోధించినందుకే."

కాని వారి ఆలోచన ఏమనగా మీరు ఇలా చేయుట ఏదో ఒక చెడు కార్యమని భావింతురు. వారి తండ్రిని, అనగా పాలకుడు, పోషకుడైన యెహోవా దేవునిని గూర్చి తెలియక మరియు నా గూర్చి నేను ఒక ప్రవక్తనని గ్రహించక ఈలాగు చేయుదురు.

ఇప్పటి వరకు ఈ సంగతులు మీతో చెప్పలేదు ఎందుకనగా మీతోనే నేను ఉన్నాను. కాని ఇప్పుడు నేను ఉండను. తండ్రి వద్దకు వెళ్ళే సమయము వచ్చుచున్నది.

నేను మీతో సత్యము చెప్పుచున్నాను. చెవి యొగ్గి వినుము. నేను వెళ్ళుట వలన మీకే ప్రయోజనం. ఆయన లోకమునకు వచ్చి పాపమును గూర్చి దానికి ఏవిధంగా ఇవ్వాలి అను విషయాలు లోక ప్రజలందరికి క్రియాత్మకంగా ఆచరించి చూపే లోకాధికారి ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం అంతిమ ప్రవక్త అని నిర్ణయం జరిగి ఉన్నదని ఏసుక్రీస్తువారు తన శిష్యులకు చెప్పియుంటిరి.

**యోషయా గ్రంథం 29:12 -** మరియు నీవు దయచేసి చదువుమని చెప్పి అక్షరములు తెలియని వానికి దానిని అప్పగించును. అతడు అక్షరములు నాకు తెలియవనును.

**వ్యాఖ్యానం:** చదవటం, వ్రాయడం రాలేనటువంటి ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం వారి గూర్చి పాత నిబంధనలో ఈ విధంగా తెలియజేయబడింది. నీవు దయచేసి చదువుమని చెప్పి అక్షరములు తెలియని వానికి దానిని అప్పగించును. అతడు అక్షరములు నాకు తెలియవనెను.

పై వాక్యములు నెరవేరినది. ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం 40 సంవత్సరముల ప్రాయంలో గారేహిరా (గుహలో)

దైవవాణి అవతరణ మొట్టమొదటి వాక్యమే అది: పఠించు! స్వరాన్ని సృష్టించిన నీ ప్రభువు (అల్లాహ్) పేరుతో. ఖుర్‌ఆన్ 96:1.

**యోహాను 14:25-26 -** నేను మీ యొద్ద ఉండగానే యీ మాటలు మీతో చెప్పితిని. ఆదరణ కర్త అనగా తండ్రి నామమును పంపబోవు పరిశుద్ధాత్మ సమస్తమును మీకు బోధించి నేను మీతో చెప్పిన సంగతులన్నింటినీ మీకు జ్ఞాపకము చేయును.

**యోహాను 16:7** - అయితే నేను మీతో సత్యము చెప్పుచున్నాను. నేను వెళ్ళిపోవుట వలన మీకు ప్రయోజనకరము. నేను వెళ్ళని యెడల ఆదరణకర్త మీ యొద్దకు రాడు;నేను వెళ్ళిన యెడల ఆయనను మీ యొద్దకు పంపుదును.

**యోహాను 16:12** - నేను మీతో చెప్పవలసినవి ఇంకను అనేక సంగతులు కలవు గాని యిప్పుడు మీరు వాటిని సహింపలేరు.

**వ్యాఖ్యానం:** ఏసువారు తన శిష్యులను ఏ విధంగా బోధించిరి. నేను మీతో చెప్పవలసిన అనేక సంగతులు ఉన్నాయి గాని ఈ కాలంలో ఈ సమయంలో మీరు వాటిని సహించపలేరు. నా తరువాత కాలం రాబోతుంది. ఆ సమయంలో మీరు వాటిని ఆచరించగలరు. అవి ఆ అంతిమ ప్రవక్త మీకు తెలియజేయును. ఆయనను విశ్వసించి ఆయన బోధనలను గైకొనవలెను. అందుయందే మోక్షం లభించును. ఈయన సత్యవంతుడని, నీతిమంతుడని బిరుదులు కూడా గలవు.

**యోహాను 14: 16-17** - నేను తండ్రిని వేడుకొందును. మీ యొద్ద ఎల్లప్పుడు నుండుటకై ఆయన వేరొక ఆదరణకర్తను, అనగా సత్య స్వరూపియగు ఆత్మను మీకనుగ్రహించును. లోకము ఆయనను చూడదు. ఆయనను ఎరుగదు. గనుక ఆయనను పొందనేరదు. మీరు ఆయనను ఎరుగుదురు. ఆయన మీతో కూడా నివసించును. మీలో ఉండును.

**వ్యాఖ్యానం:** నేను తండ్రి యొద్దకు ఎక్కిపోవుదును. మీ వద్దకు ఎల్లప్పుడు నుండుటకై మహాప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం ఆచారము ప్రళయం వరకు మార్పులు చేర్పులు లేకుండా ఉంటుంది. ఆయనే మీకు ఆదరణకర్త, సత్యస్వరూపి. ఆ విషయాలు సర్వ సాధారణమైన వ్యక్తులు గ్రహించలేరు. మీరు త్వరగా గ్రహించగలరు. ఎందుకంటే మీకు నేను ముందుగానే తెలియపర్చు చున్నాను. కాబట్టి, అలానే అల్లాహ్ దయవల్ల అనేకులు సత్యాన్ని తెలుసుకొని ఇస్లాం ధర్మమే సత్యమని ఏను బోధించిన ధర్మం కూడా ఇస్లామేనని, క్రైస్తవులు ఇస్లాంను స్వీకరించిన సంఘటనలు అనేకం ఉన్నాయి.

**ప్రియ క్రైస్తవులారా!** ఇప్పటికైనా సత్యాన్ని గ్రహించి ఇస్లాంను స్వీకరించిన యెడల మోక్షం లభించును.

**యోహాను 15:26** - తండ్రి యొద్ద నుండి మీ యొద్దకు నేను పంపబోవు ఆదరణకర్త అనగా తండ్రి యొద్ద నుండి బయలుదేరు

సత్యస్వరూపియైన ఆత్మ వచ్చినప్పుడు ఆయన నన్ను గూర్చి సాక్ష్యమిచ్చును. మీరు మొదటి నుండి నా యొద్ద ఉన్నవారు గనుక మీరును సాక్ష్యమిత్తురు.

**వ్యాఖ్యానం:** ప్రియ క్రైస్తవులారా! ఈ వాక్యాన్ని జాగ్రత్తగ పరిశీలనా బుద్ధితో గ్రహించడానికి ప్రయత్నించండి. తండ్రి యొద్ద నుండి మీ యొద్దకు ఒక ఆదరణకర్తను పంపుదునని ఏసువారు అంటున్నారు. కానీ నేటి క్రైస్తవులు ఆదరణకర్త ఆత్మ అంటే ఏసు వస్తున్నారు, వెళ్ళుచున్నారు. ఆయన గూర్చి చెప్పుకున్నారు అని పిడివాదన చేస్తున్నారు. ఒక ఉదాహరణ నేను వెళ్ళి మరొకరిని పంపుదును అంటే మీరేవస్తారా ? అని అడిగినట్లుంది.

ఆయన వచ్చి ప్రవక్త ఏసుని గూర్చి సాక్ష్యమిస్తారని ఉంది. ఏసువారి గూర్చి సాక్ష్యమిచ్చిన వారు కేవలం ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ప్రవక్త మాత్రమే. ఆయను పుట్టుక గూర్చి మరియు ఆయన తల్లి గూర్చి, క్లుప్తంగా వివరించారు. ముస్లింలు ఏసును ప్రవక్తగా నమ్మని యెడల ముస్లిమే కానేరదు. కాని ఏసు చెప్పిన ప్రకారం ఈనాటి క్రైస్తవులు ముహమ్మద్ ను నమ్ముటలేదు. మరి వీరికి మోక్షం లభిస్తుందా? లేదు ఎట్టి పరిస్థితులలో దొరకదు. ఏసు బోధనలను తిరస్కరించిన వాని స్థానం నరకమే కదా!

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఇబ్రాహీం అలైహిస్సలాం సంతానానికి చెందినవారే. ఎలా అంటే ఇబ్రాహీం అలైహిస్సలాం కు ఇద్దరు భార్యలు. ఒకరు హాజరా, రెండో ఆమె పేరు సారా. హాజరాకు ఇస్మాయీల్ అలైహిస్సలాం అను కుమారుడు కలుగగా, సారా కు ఇసాఖ్ అలైహిస్సలాం జన్మించారు. బాలింతరాలు అయిన హాజరా ను పసికందు అయిన ఇస్లాయీల్ అలైహిస్సలాం ను ఎడారి ప్రాంతంలో వదిలివెళ్ళారు. ఆ ప్రాంతమే కొంతకాలం తర్వాత మక్కాగా మారింది. ఆలా వారి సంతానంలోనుండే పుట్టిన ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం, ఇస్మాయీల్ అలైహిస్సలాం వారి వంశానికి చెందినవారే. ఈ విధంగా కూడా ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం వారే బైబిల్ లో చెప్పబడిన ప్రవక్త అని రుజువగుచున్నది.

# 10. ఖుర్ఆన్ లో చెప్పబడిన భవిష్యవాణులలో కొన్ని

ఖుర్ఆన్ అవతరిస్తున్న కాలంలోనే రోమ్ సామ్రాజ్యాన్ని పార్శీకులు కైవసం చేసుకున్నారు. అప్పుడు ఖుర్ఆన్ లో ఇలా చెప్పబడింది."రోమన్ ప్రజలు పొరుగు భూభాగంలో పరాజితు లయ్యారు; తమ ఈ పరాజయం తరువాత కొన్ని సంవత్సరాలలోనే వారు విజేతలవుతారు. ముందైనా, తర్వాత అయినా అధికారం మాత్రం అల్లాహ్ దే. ఆ రోజున అల్లాహ్ ప్రసాదించిన విజయానికి విశ్వాసులు వేడుకలు జరుపుకుంటారు." (ఖుర్ఆన్ 30:2-4)

రోమ్ మరియు ఇరాను రాజ్యాల (పార్శీకుల) మధ్య జరిగిన యుద్ధంలో రోము దేశం చిత్తుచిత్తుగా ఓడిపోయింది. మరల రోమనులు తిరిగి నిలదొక్కుకోగలరని కాని తిరిగి తమ రాజ్యాన్ని చేజిక్కించుకోగలరని గాని ఎవరూ ఊహించలేదు. కానీ ఖుర్ఆన్ లో చెప్పబడినట్లు రోమనులు 3 సంవత్సరముల మధ్యకాలములో తిరిగి తమ రాజ్యాన్ని, అధికారాన్ని సాధించారు.

రోమనులకు మరియు పార్శీకులకు (ఇరాను) క్రీ. శ. 622 సంవత్సరంలో Armenian అను ప్రాంతంలో యుద్ధం జరిగిందని అందులో రోమనులు, పార్శీకులను ఓడించి తమ రాజ్యాన్ని కైవసం చేసుకున్నారని చరిత్రకారులు చెబుతారు. History of the Byzantine అను పుస్తకము ఈ విషయాలను తెలియజేస్తున్నది.

## 11. ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం చూపిన కొన్ని మహిమలు

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం చేసిన అద్భుతాలలో మహా అద్భుతం ఖుర్ఆన్. ఏ మానవమాత్రుడూ తెలియజేయలేని ఎన్నో విషయాలను ఆయన ఖుర్ఆన్ లో తెలియజేశారు. అంతేకాక ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం మరెన్నో అద్భుతాలు చేశారు. వాటిలో కొన్నింటిని చూద్దాం.

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ను ఒక అవిశ్వాసి నీవు నిజంగా దైవప్రవక్తే అయితే చంద్రుడ్ని రెండుగా విడదీసి చూపమనగా ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం అల్లాహ్ ను స్మరిస్తూ తన చూపుడు వ్రేలుతో సైగ చేయగా చంద్రుడు కొంతసేపు రెండుగా విడిపోయెను. (బుఖారి హదీథ్ గ్రంథం)

జాబిర్ రదియల్లాహు అన్హు వారు ఉల్లేఖిస్తున్నారు – సులహ్ హుదైబియా సమయంలో ఓ సంఘటం జరిగింది. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఓ పాత్రలోని నీటితో వదూ చేస్తున్నారు. మేము ఆయన వద్దకు వెళ్ళాము. ఆయన మమ్ములను గమనించి ఏమిటి విషయం అని ప్రశ్నించారు.

ఓ ప్రవక్తా! మీ ముందు ఉన్న నీళ్ళు తప్ప మనకు త్రాగడానికి గాని వదూ చేయటానికి గాని మా వద్ద నీళ్ళు లేవు అని అన్నాము. అంతట ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం తన చేతిని

నీళ్ళలో ముంచగా, ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం చేతి వ్రేళ్ళమధ్య నుండి నీళ్ళ ఊటలు చిమ్మటం ప్రారంభించింది. ఆ నీళ్ళను మేము త్రాగినంత త్రాగాము. వదూ చేసుకున్నాము. ఆ సమయంలో మేము 1000 మందికి పైనే ఉన్నాము. (బుఖారి మరియు ముస్లిం హదీథ్ గ్రంథాలు)

ఆయన ఇలాంటి అద్భుతాలను మరెన్నో చేశారు.

## 12. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం సాదాసీదా జీవితం

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం చాలా సాధారణ జీవితం గడిపేవారని, ఆయన జీవిత చరిత్ర చదివితే అర్థం అవుతుంది. ఆయన తన వారిని ఇహలోకపు బాధల నుండి రక్షించుట కొరకు గాని లేదా అధికార వ్యామోహంలో గాని తనను తాను దైవప్రవక్తగా ప్రకటించుకోలేదు. అలానే అధికారాన్ని ఆయన ఏనాడు తన స్వప్రయోజనాల కొరకు వాడు కోలేదు. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం 40 సంవత్సరముల వయస్సులో ప్రవక్తగా నిర్ణయింపబడ్డారు. ఆ సమయంలో ఆయన ఆర్థిక స్థితి ఎంతో మెరుగ్గా ఉండేది. అంతే కాకుండా మంచి వ్యాపారవేత్తగా పేరు పొందారు మరియు మక్కా వాసులు ఆయనను సత్యవంతుడని నమ్మకస్తుడని, విశ్వాస పాత్రుడని, సహనశీలుడని, దాత్రుగుణం కలవాడని కొనియాడేవారు. అలా పొగిడిన వారంతా 'తాను దైవప్రవక్త నని, బహుదైవారాధన మాని మీరంతా ఒకే అల్లాహ్ ను ఆరాధించమని' చెప్పగానే ఆయనను వ్యతిరేకించారు. ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం నడిచే మార్గంలో ముళ్ళకంపలు పరిచారు. ఆయనపై ఇసుక గుమ్మరించే వారు. ఆయననే కాదు ఆయనకు సహకరించే వారిని కూడా హింసించేవారు. ఆఖరికి హత్యాయత్నం కూడా చేసారు. పొగిడిన వాళ్ళే శాపనార్థాలు పెట్టారు. నమస్కరించిన చేతులే రాళ్ళు రువ్వాయి. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం చలించలేదు. మక్కా అవిశ్వాసులలోని పెద్దలందరూ కలిసి ముహమ్మద్ సల్లల్లాహు

అలైహి వసల్లం ను ఇస్లాం ప్రచారం ఆపమని ఆయన బాబాయి చేత కబురు పంపారు. దానికి జవాబుగా ఆయన ఇలా అన్నారు. 'మీరు ఒక చేతిలో చంద్రుడు మరో చేతిలో సూర్యుడు ఉంచినా నేను మాత్రం ఇస్లాం ధర్మప్రచారం మానలేను' అన్నారు.

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం తన సంపదనంతా బీదసాదలపై ఖర్చు చేసేవారు. ఆయన మదీనాకు వలస వెళ్ళిన తరువాత ఇస్లాం బలం పుంజుకుంది. స్వచ్ఛందంగా ఎందరో ఇస్లాం లో చేరారు. అరబ్బు ప్రాంతాలెన్నో ఇస్లాం వశం అయినాయి. అలాంటి సమయంలో కూడా ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం సాధారణ జీవితమే గడిపేవారు.

'మా ఇంట్లో ఒక్కోసారి రెండు చంద్రులు గడిచినా (రెండు నెలల పాటు) పొయ్యి వెలిగించేవారమే కాదు' అని ఆయిషా రదియల్లాహు అన్హా (ఈమె ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం భార్యామణి) అన్నారు. 'ఆ సమయంలో మేము రెండు నల్లటి వస్తువులతోనే కాలం వెళ్ళబుచ్చేవారము. ఆ నల్లటి వస్తువులు ఏమని ప్రశ్నించగా అవి ఒకటి కర్జూరములు, రెండవది నీళ్ళు అన్నారు.' (బుఖారీ, ముస్లిం)

ఇబ్నె సాద్ రదియల్లాహు అన్హు ఇలా ఉల్లేఖిస్తున్నారు - 'ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ప్రవక్త అయిన నాటి నుండి చివరి ఘడియ వరకు ఆయన తన ఇంటిలో జల్లించిన మెత్తటి

పిండితో చేసిన రొట్టెలు భుజించనేలేదు.' (బుఖారీ మరియు ముస్లిం)

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం కర్జూరపు పీచుతో తయారు చేయబడిన పరుపుపై పరుండేవారు. దానిపై పడుకొనుట వలన ఆ పీచు గుర్తులు వీపుపై పడేవి. బుఖారీ మరియు ముస్లిం హదీథ్ లు

అమర్ ఇబ్నె హారీద్ రదియల్లాహు అన్హు ఇలా తెలియజేశారు - 'ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఈ లోకంలో నుండి తనువు చాలించే నాటికి ఆయన వద్ద ఉన్న ఆస్థి ఏమిటంటే ఓ తెల్లగాడిద, యుద్ధరంగంలో ఉపయోగించే కవచము, ఢాలు, ఖడ్గం మొదలైనవి. కొద్దిపాటి భూమి ఈ స్థలాన్ని కూడా బైతుల్ మాల్ కి ఇచ్చేసారు.' (బుఖారి మరియు అహ్మద్ హదీథ్ గ్రంథాలు)

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం యొక్క జీవిత విషయాలు చదివినట్లయితే ఇలాంటి విషయాలు లెక్కనేనన్ని మనకు కనబడతాయి. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం కు అధికార వ్యామోహం ఇసుమంత కూడా ఉండేది కాదు. అరబ్బు ప్రాంతమంతా ఇస్లాం అధీనములో ఉన్నా, ఏనాడూ ఆయన తన స్వలాభమునకు గాని తన వాళ్ళ గురించి గాని వాడుకోలేదు.

ఆయన అన్ని రంగాలలో తన పాత్రను సమర్ధవంతంగా నిర్వర్తించారు. ఆయన ఓ బోధకుడిలా ఎన్నో మంచి విషయాలు

బోధించేవారు. చెప్పటమే కాదు వాటిని స్వయంగా ఆచరించి చూపేవారు కూడా. ఓ పరిపాలకునిగా అందరికీ సమానంగా న్యాయాన్ని అందించేవారు. యుద్ధరంగంలో ఉన్నప్పుడు సైన్యాధిపతిగా ఎంతో ధైర్యసాహసాలు ప్రదర్శించి, సైన్యాన్ని ముందుకు నడిపించేవారు. ఇంట్లోని వారికి, ఇంటి పనులలో కూడా సహకరించేవారు. ఒక భర్తగా, ఒక తండ్రిగా, ఒక మామగా, ఒక తాతగా, అన్ని కోణాల్లో కూడా తన వంతు పాత్రను సక్రమంగా నెరవేర్చారు. మదీనాలో మస్జిదు నిర్మించే సమయంలో తన సహచరులతో కలిసి ఆయన కూడా ఇటుకలు మోసారు. ఖందఖ్ అను యుద్ధ సమయాన ఖందఖ్ (గొయ్యి) త్రవ్వుతున్నప్పుడు ఆ తవ్వకాలలో ఆయన కూడా పలుగు పట్టి గొయ్యి త్రవ్వటంలో పాలుపంచుకున్నారు.

## 13. ఇస్లాం వ్యాప్తి

నేడు ఇస్లాం ఎంతో వేగంగా అభివృద్ధి చెందుతున్నది. ముఖ్యంగా అమెరికాలో మరింత వేగంగా అభివృద్ధి చెందుతుందని వివిధ సర్వేలలో తేలింది. Hillary Rodham Clinton, Los Angles Times కూడా ఇదే విషయాన్ని తెలియజేసింది. అలానే Population Reference Bureau, USA Today ప్రపంచంలోనే అత్యధికంగా వ్యాప్తి చెందుతున్నదని తెలియజేసింది. ఇస్లాం స్వీకరించే వారిలో అన్ని వర్గాలకు చెందినవారు వివిధ ప్రాంతాలకు చెందిన వారు ఉన్నారు. ధనికులు, బీదవారు, శాస్త్రవేత్తలు, విద్యావేత్తలు, పాత్రికేయులు మరెన్నో విభాగాలకు చెందిన వారు ఉన్నారు. ఈ విషయాలు ఇక్కడ చెప్పడానికి కారణం ఏమిటంటే ఇస్లాంలోని వాస్తవాలను నేడు ప్రజలు గ్రహిస్తున్నారు. ఇందులో గల సత్యాన్ని తెలుసుకుంటున్నారు. ప్రతీ మనిషి తన మనోనేత్రాలతో ఇస్లాం వాస్తవికతను చూసినట్లైతే ఇస్లాం ను తప్పక అంగీకరిస్తారు. ఇస్లాం ధర్మం సహజమైన ధర్మం No way But Islam ఇస్లాం ధర్మం ద్వారానే స్వర్గాన్ని చేరగలము. వేరే దారిలేదు. ఇది సత్యం సత్యం. సత్యం ముమ్మాటికీ ఇది సత్యం. ..........

# 14. ఇస్లాం ధర్మం వలన ఉపయోగమేమి?

## 1. స్వర్గంలో శాశ్వతస్థానం లభించును:

"మీ ప్రభువు క్షమాభిక్ష వైపునకు పరుగెత్తండి, ఒకరికంటే ఒకరు ముందుకు పోయే కృషి చేయండి; ఆకాశాలంత, భూమియంత విశాలమైన స్వర్గం వైపునకు పరుగెత్తండి. అది అల్లాహ్ నూ ఆయన ప్రవక్తలనూ విశ్వసించిన వారి కొకరు సిద్ధం చేయబడింది. ఇది అల్లాహ్ అనుగ్రహం; తాను కోరిన వారి కొరకు దానిని ప్రసాదిస్తాడు. అల్లాహ్ ఎంతో అనుగ్రహం కలవాడు." (ఖుర్ఆన్ 57:21)

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఇలా తెలియజేశారు: స్వర్గవాసులలో చివరి దర్జాకు చెందిన వానికి ఈ భూలోకం కంటే పది రెట్లు ఎక్కువ స్థలాన్ని అల్లాహ్ ప్రసాదిస్తాడు.(ముస్లిం, అహ్మద్)

స్వర్గం యొక్క విలువ ఈ భూలోంతో పోల్చుకుంటే స్వర్గంలో ఒక పాదం మోపినంత స్థలం ఈ భూలోకం మొత్తం కంటే ఎంతో మేలైనది. (బుఖారి మరియు ముస్లిం హదీథ్ గ్రంథాలు)

స్వర్గంలో ఉన్నవాటిని ఈ ప్రపంచంలో ఏ ప్రాణీ చూడలేదు. వాటి అందాలను ఏ కన్నులూ చూడలేదు. వాటి గొప్పతనాన్ని ఏ చెవులూ వినలేదు. (ముస్లిం మరియు అహ్మద్ హదీథ్ గ్రంథాలు)

ఇహలోక జీవితమంతా కష్టాలు అనుభవించిన వ్యక్తి ఒక్కసారి స్వర్గం చూస్తే ఆ వ్యక్తి ఇలా అంటాడు. నేను ఎనాడూ కష్టాలు అనుభవించనే లేదు అంటాడు. (ముస్లిం మరియు అహ్మద్)

స్వర్గంలో ప్రవేశించినవానికి తనకు ఏది కావాలంటే అది వానికి ఇవ్వబడుతుంది. అతనికి ఎలాంటి లోటూ చెయ్యబడదు. అతని యొక్క వస్త్రాలు మాసిపోవు. అతని యౌవ్వనం తరిగిపోదు. (ముస్లిం హదీథ్ గ్రంథం)

"మా ఆయత్ లను (వచనాలను) విశ్వసించి మంచి పనులు చేసేవారిని మేము, క్రింద కాలువలు ప్రవహించే ఉద్యానవనాలలో ప్రవేశపెట్టాము. అక్కడ వారు కలకాలం ఉంటారు. ఇంకా వారికి పరిశుద్ధులైన భార్యలు లభిస్తారు. మేము వారిని దట్టమైన నీడలలో ఉంచుతాము." ఖుర్ఆన్ 4:57

"మీ ప్రభువు క్షమాభిక్ష వైపునకు, స్వర్గం వైపునకు పోయే మార్గంలో పరుగెత్తండి.ఆ స్వర్గం భూమ్యాకాశాల అంత విశాలమైనది. అది భయభక్తులు కలవారి కొరకు తయారు చెయ్యబడింది. వారు కలిమిలో, లేమిలో ఏ స్థితిలో ఉన్నా తమ సంపదను ఖర్చు చేసేవారు. కోపాన్ని దిగమ్రింగేవారు, ఇతరుల తప్పులను క్షమించే వారు. ఇలాంటి సజ్జనులంటే అల్లాహ్ కు ఎంతో ఇష్టం – వారి స్థితి ఎలా ఉంటుందంటే ఎప్పుడైనా ఏదైనా అశ్లీల కార్యం వారి వల్ల జరిగితే

లేదా ఏదైనా పాపం చేసి, వారు తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నట్లయితే, వెంటనే వారికి అల్లాహ్ జ్ఞాపకం వస్తారు. అప్పుడు వారు ఆయనను తమ తప్పులు క్షమించు అని వేడుకుంటారు. ఎందుకంటే అల్లాహ్ తప్ప పాపాలను క్షమించగలిగే వాడెవడున్నాడని వారు తాము చేసిన తప్పులను గురించి బుద్ధి పూర్వకంగా మొండివాదం చెయ్యరు. అలాంటి వారికి తమ ప్రభువు వద్ద లభించే ప్రతిఫలం ఏమిటంటే, ఆయన వారిని క్షమిస్తాడు. క్రింద సెలయేళ్ళు ప్రవహించే ఉద్యానవనాలలోకి వారిని ప్రవేశింపజేస్తాడు. వారు అక్కడ శాశ్వతంగా ఉంటారు." ఖుర్ఆన్ 3:131 – 136

పైన చెప్పబడిన ఖుర్ఆన్ వచనములు చూసినట్లయితే స్వర్గానికి అర్హత పొందడానికి కావలసిన లక్షణాలు, గుణాలు, ఇందులో చెప్పబడ్డాయి. అలానే స్వర్గంలో స్వర్గవాసులకు లభించే వాటి గురించి తెలియజేయబడ్డాయి. ఇస్లాం ధర్మాన్ని తూ.చ. తప్పక పాటించే వారికి స్వర్గం తప్పక లభిస్తుంది. ఇది సర్వలోక సృష్టికర్త అయిన అల్లాహ్ యొక్క వాగ్దానం.

## 2. ఇస్లాం ధర్మం పాటించుట వలన నరకాగ్ని నుండి విముక్తి కలుగును:

"ఎవరు అవిశ్వాసం అవలంబించి అవిశ్వాస స్థితిలోనే అసువులు బాశారో, వారిలో ఎవరైనా తమను తాము శిక్ష నుండి

కాపాడుకోవటానికి భూమినంతా బంగారం నింపి పరిహారంగా ఇచ్చినా స్వీకరించబడదు అనే విషయం నిశ్చయం. ఇలాంటి వారి కొరకు బాధాకరమైన శిక్ష సిద్ధంగా ఉంది. ఇంకా వారికి సహాయం చేసేవారెవరూ ఉండరు." ఖుర్ఆన్ 3:91

నరకాగ్ని నుండి విముక్తి పొందాలంటే ఈ లోకంలోనే మంచి పనులు చెయ్యాలి. నరకాగ్ని నుండి విముక్తి పొందాలన్నా, స్వర్గంలో స్థానం సంపాదించాలన్నా ఇహలోకంలో చేసిన కర్మలే ఉపయోగ పడును. ఈ అవకాశాన్ని జారవిడుచుకుంటే మరో అవకాశమంటూ లభించదు.

అపుడు వారు ఇలా అంటారు, "అయ్యో! మేము మళ్ళీ భూలోకానికి తిరిగి పంపబడి మా ప్రభువు సూచనలను అసత్యాలని తిరస్కరించకుండా ఉండే విశ్వాసులలో మేము కలిసిపోయే మార్గం ఏదైనా ఉంటే ఎంత బాగుండును" ఖుర్ఆన్ 6:27

ఇహలోకంలో సత్యాన్ని పెడచెవిన పెట్టినట్లయితే పరలోకంలో బాధపడినా ప్రయోజనం ఉండదు. నరకాగ్ని గురించి ఖుర్ఆన్ లో ఒకచోట ఇలా చెప్పబడింది.

"అది భగభగమండే నరకాగ్ని జ్వాల, మాంసాన్ని, చర్మాన్ని సైతం అది తినేస్తుంది. సత్యం పట్ల విముఖుడై, వెన్ను చూపి,

ధనాన్ని కూడబెట్టి దానిని మాటిమాటికీ పేర్చి పెట్టిన ప్రతివాణ్ణి అది బిగ్గరగా అరుస్తూ తన వైపునకు పిలుస్తుంది. " ఖుర్ఆన్ 70:15-18

ఇహలోకపు అగ్ని యొక్క వేడిమి కంటే నరకాగ్ని వేడిమి డబ్బై రెట్లు అధికంగా ఉంటుందని ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం తెలియజేశారు. అన్నారు (బుఖారి హదీథ్ గ్రంథం)

"ఈ లోకంలో ఎన్నడూ కష్టం అంటే ఎరుగని వ్యక్తిని నరకం ఒక్కసారి చూచిన వ్యక్తితో నీవు ఎప్పుడైనా సుఖాన్ని, సంతోషాన్ని అనుభవించావా అంటే నేను సుఖమనే దాన్ని ఎరుగను నా జీవితంలో ఎన్నడు సంతోషంగా గడపలేదు." అని పలుకుతాడు (ముస్లిం మరియు అహ్మద్ హదీథ్ గ్రంథాలు)

ఇంతటి భయంకరమైన నరకాగ్ని నుండి తమను తాము రక్షించుకోవడానికి ప్రయత్నించండి. సత్యమైన ధర్మం ఇస్లాం ధర్మాన్ని అనుసరించండి.

### 3. ఇస్లాం ద్వారానే నిజమైన ఆనందం, ఆత్మ సంతృప్తి లభించును:

మనిషికి నిజమైన తృప్తి, ఆనందం, మనశ్శాంతి సృష్టికర్త అయినటువంటి అల్లాహ్ ను ఆరాధించటంలోనూ, ఆయనకు మనల్ని మనం స్వయంగా అర్పించుకోవడంలోనూ లభించును.

"ఆయన తన వైపునకు మరలేవారికి మాత్రమే తన వైపుకు వచ్చే మార్గాన్ని చూపుతాడు.అటువంటి ప్రజలే ఈ ప్రవక్త సందేశాన్ని విశ్వసించారు. వారి హృదయాలకు అల్లాహ్ సంస్మరణం వల్ల తృప్తి కలుగుతుంది. 'తెలుసుకోండి! అల్లాహ్ సంస్మరణ ద్వారానే హృదయాలకు తృప్తిని పొందే భాగ్యం లభిస్తుంది." (ఖుర్ఆన్ 13:28)

అల్లాహ్ దివ్యఖుర్ఆన్ నందు మరొకచోటం ఇలా చెబుతున్నాడు: "నా జ్ఞాపికకు (హితోపదేశం) విముఖుడైన వానికి ప్రపంచంలో జీవితం ఇరుకవుతుంది." (ఖుర్ఆన్ 20:124)

పై వచనాన్ని బట్టి తెలుస్తున్నది ఏమిటంటే ఖుర్ఆన్ ను వదిలి పెడితే జీవితం దుర్భరం అవుతుంది. నేడు ప్రపంచంలో ముస్లింలు దుర్భరమైన జీవితాలు గడపడానికి ముఖ్యకారణం ఇదే అనడంలో ఎటువంటి సందేహరము లేదు. నూటికి 60% నుండి 80% వరకు ఎవరికి తోచిన విధంగా వారు నడుచుకుంటున్నారు. కానీ ముస్లిమేతరులలో ఎందరో విద్యావేత్తలు నేడు ఖుర్ఆన్ వచనాలను అర్థం చేసుకొని ఇస్లాం స్వీకరిస్తున్నారు. కాని దురదృష్టవశాత్తు ముస్లింలని పిలువబడేవారు దైవాజ్ఞలకు మరియు ప్రియ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం బోధనలకు దూరమై, సమాధి పూజలు, బాబాల మొక్కుబడులు, గ్యారవీంలు, బారవీంలు, ఖవ్వాలి భజనలు మొదలైన షిర్క్ & బిద్అత్ పనులకు లోనైపోయారు.

Cat Stevens (ఇప్పుడు ఆయన పేరు Yusuf Islam) ఈయన గొప్ప పాప్ గాయకుడు. ఈయన ఒక్క సాయంత్రం ప్రోగ్రాం ఇవ్వడానికి 150,000 డాలర్లు తీసుకుంటాడు. ఈ మొత్తాన్ని మన రూపాయలతో పోల్చిన 60 లక్షల రూపాయలు అవుతాయి. ఆయన ఇస్లాం స్వీకరించిన తర్వాత ఇలా అన్నారు. "నేను నిజమైన తృప్తిని, ఆనందాన్ని, మనశ్శాంతిని ఇస్లాం స్వీకరించిన తరువాతే పొందాను. నా ధనం నాకు తృప్తిని ఇవ్వలేదు."

## 15. ఇస్లాం స్వీకరించిన కొంతమంది ప్రముఖుల పేర్లు

1. జియెఫ్రి పెస్మిద్ 1900 కీ.శ. (లాయరు, ఇంగ్లాండు) కొత్తపేరు – జాఫర్ బిన్ దావూద్
2. మార్మడ్యుక్ ఫిక్తాల్ 1914 (చర్చ్ ప్రీస్ట్ పుత్రుడు (( నిస్సెట్ చర్చిల్ సహవాసి)) కొత్తపేరు ముహమ్మద్ మర్మా డ్యూక్ ఫిక్తాల్ (ఖుర్‌ఆన్ ఇంగ్లీషు అనువాదకుడు)
3. క్యాషియస్ క్లే (అమెరికా) హెవీ వెయిట్ బాక్సింగ్ ఛాంపియన్ కొత్తపేరు ముహమ్మద్ అలీ క్లే
4. హనీ కాంప్ (ఆస్ట్రేలియా) కొత్తపేరు అహ్మద్.
5. క్యాట్ స్టీవెన్స్ (అమెరికా) పాప్ గాయకుడు కొత్తపేరు యూసుఫ్ ఇస్లాం 1977లో ఇస్లాం స్వీకరించారు.
6. సొలోమన్ (అమెరికా) జర్నలిస్టు కొత్తపేరు సులైమాన్ 1997 లో ఇస్లాం స్వీకరించారు.
7. ఫ్రాంక్ (ఇంగ్లండ్), విద్యావేత్త కొత్తపేరు ఫ్రాంక్ సలావుద్దీన్
8. మరియమ్ జమీలా (అమెరికా) యూదస్త్రీ కొత్తపేరు మరియమ్ జమీలా
9. ప్రొ. రెవరెండ్ డేవిడ్ బెంజమిన్ కెల్డానీ (ఇంగ్లండ్) చర్చి బిషప్) కొత్తపేరు ప్రొ, అబ్దుల్ అహ్మద్ దావుద్
10. లేడీ యవలిన్ (ఇంగ్లాండు) జర్నలిస్టు కొత్తపేరు జైనబ్
11. డా. ఎ.ఆర్. లెహ్మాన్ (జర్మన్, మత ధర్మశాస్త్రవేత్త) (రోమన్ కాథలిక్ ప్రీస్టు) కొత్తపేరు డా. యహ్యా

12. డా. మితా (జపాన్, ఆర్థిక శాస్త్రవేత్త, సమాజవేత్త) కొత్తపేరు ప్రొ ఉమర్

13. డా. మార్కస్ (జర్మని) శాస్త్రవేత్త, రచయిత మరియు పత్రికా విలేఖరి) కొత్రపేరు డా, హమీద్

14. డా. ఎర్న్ ఫీల్స్ (ఆంత్రోపాలజీ, ఫౌండర్ ఆఫ్ మోడ్రన్ స్ట్రక్చరల్ ఫిజియోలజి) కొత్తపేరు డా ఉమర్ ఎరెన్ ఫీల్స్

15. యెవెన్ రెడ్ లీ (జర్మన్ పాత్రికేయురాలు కొంతకాలం ఆఫ్ఘనిస్తాన్ లో బంధించబడి, విడుదలైన తర్వాత ఇస్లాం స్వీకరించింది. (సేకరించిన పుస్తకం పేరు - పాపం, పరిహారం, రక్షణ)

ఇస్లాం స్వీకరించిన ఎందరో ప్రముఖుల వృత్తాంతాల అనేక వెబ్ సైటులలో ఉన్నాయి.

**ఇస్లాం అంటే ఏమిటి?**

ఇస్లాం అనగా ప్రశాంతంగా, విధేయతగా, మనస్ఫూర్తిగా సర్వలోక సృష్టికర్త అయిన అల్లాహ్ కు స్వయంగా సమర్పించుకొనుట. అలా సమర్పించుకున్న వారిని ముస్లింలు అంటారు.

కేవలం ఖుర్ఆన్ మరియు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ప్రవచనములు మాత్రమే ఇస్లాం ధర్మపు హితబోధనలు. ఖుర్ఆన్ లో లేనివి ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం బోధించనివి ఇస్లాం ధర్మోపదేశాల, మూల సిద్ధాంతాల పరిధిలోనికి రాజాలవు.

ప్రతీ ముస్లిం ఈ దిగువ వాటిపై పూర్తి విశ్వాసం కల్గి ఉండాలి. 1) అల్లాహ్ పై అని 2) దైవగ్రంథాలపై 3) దైవదూతలపై 4) దైవ ప్రవక్తలపై 5) తీర్పుదినంపై 6) విధివ్రాత పై ఇవే కాకుండా స్వర్గం నరకం ఉన్నాయని నమ్మకం ఉంచాలి.

మరోచోట ఖుర్ఆన్ లో ఈ విధంగా చెప్పబడింది. "అల్లాహ్ ఆయన తప్ప ఆరాధ్యదైవం ఎవ్వడూ లేడు. సకల చరాచర సృష్టికి మూలాధారం అయిన ఆయన సజీవుడు, నిత్యుడు, అనంతుడు, ఆయన నిదురపోడు, ఆయనకు కునుకు రాదు. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ ఆయనదే. ఆయన సమ్ముఖంలో ఆయన అనుజ్ఞ లోకుండా సిఫార్సు చెయ్యగల వాడెవ్వడు? ప్రజల ముందు ఉన్న దానినీ ఆయన ఎరుగును. వారికి గుప్తంగా ఉన్నదీ ఆయనకు తెలుసు. ఆయన స్వయంగా తెలియజెయ్యాలని అభిలషిస్తే తప్ప ఆయనకున్న జ్ఞాన విశేషాలలోని ఏ విషయమూ వారి గ్రహణ పరిధిలోకి రాదు. ఆయన రాజ్యాధికారం ఆకాశాలనూ, భూమినీ పరివేష్ఠించి ఉన్నది. వాటి సంరక్షణ ఆయనకు ఎంతమాత్రము అలసట కలిగించదు. ఆయన మాత్రమే సర్వాధికుడు, సర్వోత్తముడూనూ." (ఖుర్ఆన్ 2:255)

మన మదిలో మెదిలే ఊహలను సహితం ఎరుగే శక్తి కలవాడు అల్లాహ్ మనం చేసే ప్రతి విషయాన్ని కూడా ఆయన గమనిస్తున్నాడని మనం పూర్తిగా నమ్మాలి. ఆయనను అర్థిస్తే

ఆయన కరుణిస్తాడని కూడా ఆయనను వ్యతిరేకించినా లేదా ఆయనతో ఇతరులను సాటి కల్పించినా, ఆయన ఆగ్రహానికి గురి కావల్సి వస్తుంది అని గ్రహించాలి. ఆయన రూపొందించిన చట్ట ప్రకారమే మనం నడుచుకోవాలి. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం అల్లాహ్ యొక్క చిట్టచివరి ప్రవక్త, ఆదరణకర్త అని కూడా పూర్తిగా నమ్మాలి. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం చూపిన విధానం ప్రకారమే జీవితం గడపాలి. ఇందులో ఎలాంటి హెచ్చు తగ్గులు చేయరాదు.

"విశ్వాసులారా! మీరు అల్లాహ్ కు విధేయత చూపండి, ప్రవక్తకు విధేయత చూపండి, మీ పనులను (కర్మలను) వృధా చేసుకోకండి." (ఖుర్ఆన్ 47: 33)

ఇస్లాం ధర్మానికి ఖుర్ఆన్ మరియు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఆచరణలు వారి ప్రవచనాలు రెండు చక్రాల లాంటివి. వీటిలో మరోమాట చేర్చినా లేదా అందులో తారుమారు చేసినా అది ఇస్లాం కాదు, మనం ఇస్లాం ధర్మాన్ని గురించడానికి ఇవి రెండు గీటురాయి లాంటివి. ఎంత పెద్ద విద్వాంసుడైనా వీటి ఆధారంగానే బోధన చెయ్యాలి. ఇవి తప్ప తన స్వంత ఆలోచనలు చెప్పిన అవి ఇస్లాంకు సంబంధం ఉండదు.

**దేవదూతలపై విశ్వాసం కల్గి ఉండాలి:** దేవదూతలు ఉన్నారని వారు ఎల్లవేళలా అల్లాహ్ నామస్మరణలోనే ఉంటారని అల్లాహ్ వారిలో కొందరిని ఒక్కొక్క కార్యక్రమములో నియమించి ఉంచాడని వారు ఆ పనిలో నిమగ్నమై ఉంటారు. వీరిలో జిబ్రయీల్ అను దేవదూత ప్రవక్తల వద్దకు అల్లాహ్ సందేశాలను తీసుకొని వచ్చేవారు ఇది ఆయన పని. అలానే ప్రతి మనిషి వద్ద ఇద్దరు దేవదూతలు ఉంటారు. వారి పేర్లు కిరాముస్, కాతిబిన్ లు. ఇలా ఎందరో దేవదూతలు ఉన్నారని ఒక ముస్లిం పూర్తి విశ్వాసం కల్గి ఉంటారు.

**దైవగ్రంథాల పట్ల విశ్వాసం:** అల్లాహ్ తన ప్రవక్తలపై తన గ్రంథాలను అవతరింపజేస్తాడని ముస్లింలు విశ్వసిస్తారు. ఉదాహరణకు – మూసా అలైహిస్సలాం పై తౌరాతు గ్రంథం, ఈసా అలైహిస్సలాం పై ఇంజీలు (బైబిలు ప్రతులు), దావూద్ అలైహిస్సలాం జబూర్ గ్రంథం ఇలా ఎందరో ప్రవక్తలపై అవతరించిన వాటిపై విశ్వసిస్తారు. అలానే ఖుర్ఆన్ చిట్టచివరి గ్రంథం అని దీనిని అనుసరించి జీవనం సాగించిన వారికే స్వర్గం లభిస్తుందని, ఇది మంచి చెడులను విడమర్చి చెప్పే గ్రంథం అని ఇది ప్రళయ దినం వరకు ఎలాంటి మార్పులు జరగకుండా చేసే బాధ్యత తనే తీసుకున్నాడని ఖుర్ఆన్ లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు. "ఇక ఈ జ్ఞాపికను (ఖుర్ఆన్) దానిని మేము అవతరింపజేసాము. స్వయంగా మేమే దానిని రక్షిస్తాము" ఖుర్ఆన్ 15:9

**దైవప్రవక్తలపై నమ్మకం:** లక్షకు పైగా ప్రవక్తలు వచ్చారని ముస్లింలు నమ్ముతారు. వీరంతా సత్యవంతులని, వీరు అల్లాహ్ సందేశాన్ని తమ ప్రజలకు వినిపించేవారని, వీరిలో కొందరు ఆదం, నూహు, ఇబ్రాహిమ్, ఇసాఖ్, ఇస్మాయీల్, లూత్, యూఖుబ్, యుసుఫ్, యునుస్, సులైమాన్, ముసా, ఈసా, ఇలా అందరి ప్రవక్తల పట్ల విశ్వాసం కల్గి ఉంటారు. చిట్టచివరి ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం అని ఆయన తరువాత మరో ప్రవక్త రారు. "(మానవులారా) ముహమ్మద్ మీలోని ఏ పురుషునికి తండ్రి కారు. కాని ఆయన అల్లాహ్ యొక్క ప్రవక్త, దైవప్రవక్తల పరంపరను సమాప్తం చేసే చివరివారు అల్లాహ్ సకల విషయాల జ్ఞానం కలవాడు" (ఖుర్ఆన్ 33:40)

ప్రవక్తలు సత్యతిరస్కార(అవిశ్వాస) వైఖరి అవలంభించమని గాని లేదా తమను ఆరాధించమని ఎప్పటికి అనరు. వారందరూ నీతిమంతులు, సత్యవంతులు. ఈ విషయాన్ని ఖుర్ఆన్ ధృవ పరుస్తుంది. "అల్లాహ్ ఒక మనిషికి గ్రంథం, రాజ్యాధికారం, దైవదౌత్యం ప్రసాదించినప్పుడు, ఆ వ్యక్తి ప్రజలతో మీరు అల్లాహ్ ను వదిలి తనకు భక్తులుగా మారమని అనడం తగదు. దానికి బదులు 'మీరు గ్రంథాన్ని(ప్రజలకు) బోధిస్తున్నారు. స్వయంగా పఠిస్తున్నారు కూడా. అందువల్ల మీరు (మీ) ప్రభువుకు విశ్వసనీయులయిన దాసులుగా రూపొందండి' అని అంటాడు అతను.

అంతే కాకుండా మీరు దైవదూతలను, దైవ ప్రవక్తలను దేవుళ్ళుగా చేసుకొని ఆరాధించండని కూడా అతను ప్రజలతో అనడు. మీరొకసారి ముస్లింలైపోయిన తరువాత తిరిగి అవిశ్వాస వైఖరి అవలంబించమని అతనెలా చెప్పగలడు?" ఖుర్ఆన్ 3:79-80

# 16. తీర్పుదినం ఉందని ముస్లింలు విశ్వసించాలి

మనిషి మరణించిన తరువాత ఒకరోజు మానవులంతా తిరిగి లేపబడతారని ఇహలోకంలో చేసిన కర్మలను బట్టి తీర్పు ఇవ్వబడుతుందని ముస్లింలు విశ్వసిస్తారు. తాము చేసిన కర్మలను బట్టి స్వర్గం, నరకం నిర్ణయింపబడుతుందని కూడా నమ్ముతారు.

**తీర్పుదినం:** పరలోక జీవితం ఉందని, అదే శాశ్వత జీవితమని, ఇహలోకంలో మనం చేసుకున్న కర్మలకు ఫలితం అక్కడే నిర్ణయించ బడుతుందని, ఇహలోకం ఓ పరీక్షా నిలయమని, అందులో ఉత్తీర్ణులు అయితేనే పరలోకంలో స్వర్గం లభిస్తుందని విశ్వసించాలి.

అంతిమ దినాన ఓ ప్రళయం వస్తుంది. అప్పుడు ప్రపంచం మొత్తం నాశనం అయిపోతుంది. తరువాత అల్లాహ్, మొట్టమొదటి మానవుడు అయిన ఆదం అలైహిస్సలాం మొదలుకొని ప్రళయదినం వరకు జన్మించిన సమస్త మానవులనూ తిరిగి లేపును. ఆ తరువాత వారి కర్మల గురించి ప్రశ్నిస్తాడు. తన ఆజ్ఞానుసారం నడుచుకున్న వారికి స్వర్గంలో స్థానాన్ని కల్పించును. తన ఆజ్ఞలను ధిక్కరించిన వారిని నరకంలో పడవేయును.

"అల్లాహ్ ను విశ్వసించి, మంచిపనులు చేసేవారే స్వర్గ వాసులు, వారు స్వర్గంలో శాశ్వతంగా ఉంటారు." ఖుర్ఆన్ 2:82

ఖుర్ఆన్ లో మరోచోట ఇలా చెప్పబడింది - "ఎవడైనా ఈ విధేయతా విధానాన్ని (ఇస్లాం) కాక మరొక మార్గాన్ని అవలంభించదలిస్తే, ఆ మార్గం ఎంతమాత్రం ఆమోదించ బడదు. అతడు పరలోకంలో విఫలుడౌతాడు, నష్టపోతాడు" ఖుర్ఆన్ 3:85

ఇహలోకపు జీవితం చాలా చిన్నది. తీర్పుదినం నాడు సత్యతిరస్కారులను అల్లాహ్ "మీరు భూలోకంలో ఎంతకాలం ఉన్నారని" ప్రశ్నిస్తాడు. అప్పుడు వారేమంటారో ఈ ఖుర్ఆన్ వచనాలలో చూడండి. "చెప్పండి, భూలోకంలో మీరు ఎన్ని సంవత్సరాలున్నారు" వారు, "మేము ఒక రోజో లేక రోజులో కొంతభాగమో అక్కడ ఉన్నాము. లెక్క పెట్టేవారిని అడగండి" అని అంటారు. ఇలా సెలవీయబడుతుంది, "కొంతకాలమే ఉన్నారు కదా! అయ్యో, మీరు ఈ సత్యాన్ని అప్పుడే అర్థంచేసుకుని ఉంటే ఎంత బాగుండేది. మేము మిమ్మల్ని వృధాగానే పుట్టించామని, మా వైపునకు మీరు ఎన్నడూ మరలి రావటమనేది జరగదని భావించారా?" ఖుర్ఆన్ 23:112-115

ఒకసారి మనం గడిచిన గతం గురించి ఆలోచిస్తే అర్థం అవుతుంది మన బాల్యం, యౌవ్వనం ఇలా ఏ దశకు ఆ దశ ఇట్లే గడిచిపోతుంది. అసలు నిజమైన జీవితం శాశ్వతమైన జీవితం పరలోక జీవితమే ఇహలోక జీవితంతో పోలిస్తే ఎంత ఉంటున్నదీ

అన్న విషయం గురించి ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఓ ఉదాహరణ ఇచ్చారు – మీరు సముద్రంలో ఒక వేలు ముంచండి, తరువాత దానిని బయటకు తియ్యండి. మీ చేతి వ్రేనుకి ఎంత నీరు అంటుకుని ఉందో అది ఇహలోక జీవితం అయితే సముద్రంలో మిగిలివున్న నీరు పరలోక జీవితం (అంటే పరలోక జీవితం ముందు ఇహలోక జీవితం నీటిబిందువు లాంటిది)

**ముస్లింలు ఖుర్ఆన్ తరువాత ముహమ్మద్** సల్లల్లాహు అలైహి వసల్లం **ఉపదేశాలను అంతే పవిత్రంగా భావిస్తారు.**

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం జీవన విధానం మరియు ఆయన యొక్క ప్రవచనాలను అనుసరించి తమ జీవితాన్ని సాగించాలి. వీటినే హదీథ్ లు అంటారు. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం తో ఉండిన సహచరులు కొందరు వీటిని వ్రాసి భద్రపరుచుకునేవారు. కొందరు కంఠస్తం చేసుకునేవారు. వారి ద్వారానే హదీథ్ నేడు మన వరకు వచ్చినాయి. ముఖ్యమైన హదీథ్ గ్రంథాలలో మొదటిది బుఖారి హదీథ్ గ్రంథం, రెండవది ముస్లిం హదీథ్ గ్రంథం. వీటి తర్వాత స్థానంలో తిర్మథీ, అబుదావుద్, నసాయి, ఇబ్నె మాజా, తిబ్రాని మొదలైన ఇతర హదీథ్ గ్రంథాలు వస్తాయి.

**ముహమ్మద్** సల్లల్లాహు అలైహి వసల్లం **బోధించిన కొన్ని హదీథ్ లు.**

- దేవుడు మీ రూపం గాని మీ రంగు గాని మీ ధనాన్ని గాని చూడడు. మీ భయభక్తులే ఆయన చూస్తాడు. (ముస్లిం గ్రంథం)
- శ్రామికుని చెమట ఆరక ముందే ఆయన కూలి డబ్బులు ఆయనకు చెల్లించండి (ఇబ్నె మాజా హదీథ్ గ్రంథం)
- జంతువులతో మంచిగా ప్రవర్తించండి. దాని ఫలితం దేవుని వద్ద ఉంటుంది. (బుఖారి, ముస్లిం హదీథ్ గ్రంథాలు)
- ముస్లింలందరూ ఒకే శరీరంలా కలిసిమెలసి ఉండాలి (శరీరంలో ఏ భాగానికి గాయమైన మొత్తం శరీరానికి బాధ కల్గుతుంది.) బుఖారీ, ముస్లిం హదీథ్ గ్రంథాలు
- నిజమైన ముస్లిం చేసే పనులు మంచిగా ఉంటాయి. మరియు ఆయన తన ఇంటివారితో మంచిగా మెలుగును.అహ్మద్, తిర్మిథి
- నీకు ఇష్టమైనదే నీతోటి వారి కొరకు ఇష్టపడు (బుఖారి, ముస్లిం హదీథ్ గ్రంథాలు)
- మానవాళిపై కరుణ చూపండి అల్లాహ్ మీ పై కరుణ చూపుతాడు (తిర్మిదీ, అహ్మద్ హదీథ్ గ్రంథాలు)
- మీ సోదరునితో నవ్వుతూ పలకరిస్తే దానం చేసినంత పుణ్యం లభిస్తుంది. (తిర్మదీ హదీథ్ గ్రంథం)
- ఓ మంచిమాట దానం లాంటిది.బుఖారి,ముస్లిం హదీథ్ గ్రంథాలు
- ఎవరైతే అల్లాహ్ ను మరియు తీర్పుదినాన్ని విశ్వసిస్తారో, వారు తమ ఇరుగుపొరుగుతో మంచిగా ప్రవర్తిస్తారు. (బుఖారి,ముస్లిం)

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఇలాంటి బోధనలు ఎన్నో మనకు చేసినారు. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం మాట స్వర్గానికి బాట. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం విధానాన్ని వదలి వేరే విధానాన్ని అనుసరిస్తే, వాడి కర్మలు వృధా అవుతాయని ఖుర్ఆన్ లో హెచ్చరించబడింది.

"ప్రవక్తా! నీవు ప్రజలకు ఇలా చెప్పు "మీకు నిజంగానే అల్లాహ్ పట్ల ప్రేమ ఉంటే నన్ను అనుసరించండి. అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు. మీ పాపాలను మన్నిస్తాడు. ఆయన అమితంగా క్షమించేవాడు, అనన్యంగా కరుణించేవాడూను."" ఖుర్ఆన్ 3:31

"అల్లాహ్ కూ, ప్రవక్తతూ విధేయత చూపేవారు, అల్లాహ్ కు భయపడేవారు ఆయన పట్ల అవిధేయతకు దూరంగా ఉండేవారు మాత్రమే విజయం పొందుతారు" ఖుర్ఆన్ 24:52

"నమాజు స్థాపించండి, జకాత్ (దానం) ఇవ్వండి. దైవప్రవక్తకు విధేయులుగా ఉండండి. అప్పుడే మీరు కరుణింపబడతారని ఆశించవచ్చు" (ఖుర్ఆన్ 24:57)

ప్రతి ఒక్కరూ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ను తప్పక అనుసరించవలసి ఉన్నది అలా చేయని వారి కర్మలు వృధా అవుతాయి, పరలోకంలో ఎటువంటి ప్రయోజనాన్నీ చేకూర్చలేవు.

## 17. ఒక వ్యక్తి ముస్లింగా మారాలంటే.....

మొట్టమొదట - అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడని మరియు ముహమ్మద్ అల్లాహ్ యొక్క ప్రవక్త అని మనస్పూర్తిగా నమ్మాలి.

అల్లాహ్ కు సాటి సరిసమానులు ఎవ్వరూ లేరని ఆయనను తప్ప మరెవ్వరిని ఆరాధించరాదు. ఆయనే ఆపదల నుండి రక్షించువాడు, ఆకలిదప్పికలు తీర్చువాడు రోగములను నయం చేయువాడు, ఆకాశమును భూమాని వాటి మధ్య ఉన్న సమస్తమును సృష్టించువాడు ఆయనే. ప్రాణము పోయువాడు, ప్రాణము తీయువాడు ఆయనే. సూర్యచంద్రులను నడిపించు వాడు, రాత్రి పగలు ఒకదాని తరువాత ఒకటి ఏర్పరచువాడు, ఆయనకు తల్లిదండ్రులు లేరు. ఆయన ఎవరిని కనలేదు. ఆయన నిద్రపోడు ఆయనకు కునుకురాదు. ఈ సృష్టిని నడిపించడంలో ఆన అలసిపోడు. ఆయన మేలు చేయదలచిన వ్యక్తిని ప్రపంచవాసులందరూ కలిసినా కీడు చెయ్యలేరు. అలానే ఆయన కీడు చెయ్యదలచిన వ్యక్తిని ఎవ్వరూ మేలు చెయ్యలేరు.

శిశువు పుట్టినప్పటి నుండి చివరికి ముసలివాడై మరణించే వరకు జీవితంలో ప్రతి విషయంలో పిల్లవాడికి పేరు పెట్టడం, వాడి అభ్యాసం, పెళ్ళి మరియు దినచర్యలు ఆస్తులు వాటి పంపకాలు, ఇలా జీవితంలో ప్రతి అంశంలో ముహమ్మద్సల్లల్లాహు అలైహి వసల్లం

చూపిన, చెప్పిన విధమునే అనుసరించాలి మరియు ఖుర్‌ఆన్ ను దైవగ్రంథం అని నమ్మాలి. తీర్పుదినం ఉందని నమ్మాలి. మరణానంతర జీవితం ఉందని, అదే శాశ్వత జీవితం అని నమ్మాలి.

అల్లాహ్ అనంత కరుణామయుడు. ఎవరైతే తమ తప్పులను తెలుసుకొని ఆయన పట్ల విధేయుడై క్షమాపణ కోరుకుంటారో, ఆయన వారిని క్షమిస్తాడు మరియు తన వైపునకు మరలి వచ్చినందుకు ఆయన ఎంతో ఆనందిస్తాడు. ఈ విషయమై ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఇలా తెలియజేశారు. తప్పు చేసిన వ్యక్తి అల్లాహ్ ఎదుట క్షమాపణ కోరినచో అల్లాహ్ ఎంతగా ఆనందిస్తాడంటే - ఎడారిలో ఒంటెపై ప్రయాణిస్తున్న వ్యక్తి ఎడారి మధ్య మార్గంలో వెళ్ళాక కొంతసేపు సేద తీర్చుకోవటానికి ఆగినప్పుడు ఆ వ్యక్తి నిద్ర పట్టేసింది. మెళుకువ వచ్చిన తరువాత ఆ వ్యక్తి చూడగా తాను ప్రయాణించిన ఒంటె దానిపై ఉన్న సామానులతో సహా అక్కడ కనిపించలేదు. చుట్టూ కలియచూసాడు. ఒంటె జాడలేదు. ముందుకు ప్రయాణించే శక్తి లేదు. నిరుత్సాహంతో అక్కడే కూలబడి కొంతసేపు నిద్రపోయాడు. తర్వాత మేల్కొని చూడగా అతని ఒంటె, దాని మీద అతని సామాన్లు తన ముందు కనబడినాయి. ఒక్కసారిగా అతడు ఆశ్చర్యం, ఆనందంతో "ఓ అల్లాహ్ నీవు నా దాసుడవు, నేను నీ యజమానిని అన్నాడు." నేను నీ దాసుడను అనటానికి బదులుగా ఆనందంలో ముస్లిం, బుఖారి

తప్పిపోయిన వస్తువు దొరికినప్పుడు మనం ఎంత ఆనందం పొందుతామో అంతకంటే ఎక్కువగా, మార్గభ్రష్టుడైన వ్యక్తి సన్మార్గాన్ని అనుసరించినప్పుడు, తన పాపాలు క్షమించమని వేడుకున్నప్పుడు అల్లాహ్ ఆనందిస్తాడు. అంతేకాక ఆ వ్యక్తి పాపాలను క్షమించి ఇహపరలోకాలలో సుఖశాంతులను, సాఫల్యాన్ని ప్రసాదిస్తాడు.

# 18. ఖుర్ఆన్ లో ఏముంది ?

ఇది అల్లాహ్ పంపిన గ్రంథాలలో చిట్టచివరి గ్రంథం. ఇది కేవలం ముస్లింల కొరకు మాత్రమే అవతరించిన గ్రంథం కాదు. మొత్తం మానవజాతి మార్గదర్శకత్వం కోసం అవతరించిన గ్రంథం. ఈ గ్రంథాన్ని అనుసరించి జీవనం సాగించిన వాడే అసలైన ముస్లిం.

ఈ గ్రంథంలో ఒక మనిషికి కావలసిన అన్ని అంశాలు చెప్పబడ్డాయి. అసలు ఎవరిని ఆరాధించాలి, ఆయననే ఎందుకు ఆరాధించాలి, ఎవరిని వివాహమాడాలి, ఎవర్ని వివాహమాడ కూడదు, తల్లిదండ్రులను ఎలా గౌరవించాలి, పురుషుని బాధ్యతలు ఏమిటి, స్త్రీల పట్ల ఎలా వ్యవహరించాలి, బంధువుల పట్ల ఎలా మెలగాలి, అనాధల పట్ల ఎలా మెలగాలి, ఆర్ధికపరమైన లావాదేవీలు, యుద్ధరంగంలోను వ్యవహరించవలసిన నియమ నిబంధనలు, మానవతా ధర్మాలు ఇలాంటి మరెన్నో విషయాలు ఇందులో ఉన్నాయి. ఈ గ్రంథాన్ని అనుసరించి తన జీవితాన్ని సాగించిన వాడే నిజమైన ముస్లిం.

**ముహమ్మద్** సల్లల్లాహు అలైహి వసల్లం **ఎవరు ?**

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం అల్లాహ్ యొక్క చిట్టచివరి ప్రవక్త. ఈయన మక్కాలో క్రీ.శ. 571 సంవత్సరంలో జన్మించారు. తల్లి గర్భంలో ఉన్నప్పుడే ఆయన తండ్రి చనిపోయారు. ఆ తరువాత

ఆయన పసితనంలోనే తల్లి చనిపోయింది. వీరు మక్కాలోని ఖురైష్ వంశానికి చెందిన వారు. తల్లిదండ్రులిద్దరూ చనిపోయిన తర్వాత ఆరు సంవత్సరాల వరకు తాతగారైన అబ్దుల్ ముత్తలిబ్ వద్ద పెరిగారు. తాతగారి మరణానంతరం చిన్నాన్న అయిన అబూతాలిబ్ ఈయనను పెంచి పెద్ద చేశారు. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం చిన్నతనం నుండి సత్ప్రవర్తన కలిగి ఉండేవారు. ఈయన యుక్తవయస్సు వచ్చేసరికి మక్కావాసుల మదిలో సత్యవంతుడిగా నిజాయితీ పరునిగా, కల్మషం లేని వ్యక్తిగా పేరుపొందారు. ఈయనను మక్కావాసులందరూ అమీన్, సాదిఖ్ అని కొనియాడేవారు. 40 సంవత్సరముల వయస్సుకు చేరుకున్నప్పుడు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం పై ఖుర్ఆన్ అవతరిండం ఆరంభమైంది. జిబ్రాయిల్ అలైహిస్సలాం అను దైవదూత ఖుర్ఆన్ వచనాలను ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం కు వినిపించేవారు. ఈ ఖుర్ఆన్ గ్రంథం ఒక్కసారిగా కాకుండా 23 సంవత్సరాల కాలం పాటు కొద్దికొద్దిగా అవతరించింది. ప్రవక్తగా నియమింపబడిన తర్వాత ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం 13 సంవత్సరాల పాటు మక్కాలో ఉన్నారు. ఈ 13 సంవత్సరముల కాలంలో సత్యతిరస్కారులు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ను ఎన్నో రకాలుగా బాధ పెట్టారు. ఆయననే కాదు ఆయనను అనుసరించే వారిని సహితం వదలలేదు. పొగిడిన నోళ్ళే దూషించాయి. సలాం కొట్టిన చేతులే రాళ్ళు రువ్వాయి. అయినా ఆయన చలించలేదు.

చివరకు అల్లాహ్ ఆజ్ఞానుసారం 260 మైళ్ళ దూరంలో ఉన్న మదీనాకు వలస వెళ్ళారు. ఇది మక్కాకు ఉత్తర దిక్కున ఉన్నది. ఇక్కడ నుండి ఇస్లాం నలుదిక్కులకు వ్యాప్తి చెందింది. కొంతకాలం తరువాత ముస్లింలు మక్కాను కూడా జయించారు. అప్పుడు కూడా ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం మక్కాలో తనను వేధించిన వారిపై ప్రతీకారం తీర్చుకోవటం గాని, వారిని శిక్షించటం గాని చెయ్యలేదు. వారందరిని క్షమించి విడిచిపెట్టారు. మదీనా వచ్చిన తర్వాత ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం దాదాపు 10 సంవత్సరాల పాటు జీవించారు. మదీనాలోనే ఆయన తన చివరి శ్వాస విడిచారు. ఈనాటికీ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం సమాధి మదీనాలోని మస్జిదే నబవి ప్రక్కన ఉన్నది.

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం సద్గుణ సంపన్నులు. ఆయన సంసార జీవితాన్ని గడుపుతూనే నిరాండంబరమైన జీవితం గడిపేవారు. ఒక తండ్రిగా, ఓ భర్తగా, ఓ బోధకునిగా, న్యాయనిర్ణేతగా, సైన్యాధిపతిగా, స్నేహితునిగా ఇలా ఆయనను ఎలా చూసినా అన్నింటిలోనూ మానవజాతిలోనే మహోన్నతుడిగా కనబడును. ఆయన ప్రతీదీ ఆచరించి చూపేవారు. అందుకే ఆయన నామాన్ని ఎల్లవేళలా తన నామంతో ఉచ్ఛరించే విధంగా చేసాడు అల్లాహ్.

ఉదాహరణకు ప్రపంచం మొత్తం మీద ముస్లింలు ఉన్నారు. ముస్లింలు ఉన్నచోట కనీసం ఒక్క మస్జిదు అయినా ఉంటుంది. ఆ

మస్జిద్ లో ప్రతిరోజు అయిదు పూటలా అదాన్ ఇవ్వబడును. సూర్యోదయం కంటే ముందు, మధ్యాహ్నం వేళలో, సాయంత్రం వేళలో, సూర్యాస్తమయం తర్వాత, అలానే చీకటిపడిన తరువాత. సూర్యోదయం సమయం ఒక ప్రాంతానికి మరో ప్రాంతానికి తేడా ఉంటుంది. నిముషాలు నుండి గంటల వరకు తేడా ఉంటుంది. విశాఖపట్నంలో ఉదయం గం 4 – 20 నిమిషాలకు అదాన్ ఇస్తే, విజయనగరంలో కొన్ని నిముషాలు తేడాతో ఇవ్వబడుతుంది. మన పగలు, అమెరికాలో రాత్రి అవుతుంది. అక్కడి పగలు, మనకు రాత్రి అవుతుంది. ఇలా మనం చూసినట్లయితే ప్రపంచంలో ప్రతి 2 నుండి 5 నిముషాలలో ఏదో ఒకచోట సూర్యోదయం, సూర్యాస్తమయం అవుతుంటాయి. అంటే ప్రతి 2 నుండి 5 నిముషాలలో ఎక్కడో ఒక చోట **అదాన్** ఇస్తూనే ఉంటారు. ప్రతి అదాన్ లోనూ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం పేరు తప్పకుండా పేర్కొనబడుతుంది. ఈ విధంగా ప్రపంచంలో ఏ మానవునికి దక్కని పురస్కారం అంటే ప్రతి క్షణం ఏదో ఒక చోట ఆయన పేరు పేర్కొనబడటమనే మహోన్నతమైన గౌరవం ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం కు ప్రసాదించపడినది.

అలాగే అదాన్ ఆయిన తర్వాత దరూద్ పఠించి దుఆ చేయాలి. అంటే ప్రపంచంలో ప్రవక్త పై దరూద్ పఠించని (దుఆ పంపని) క్షణమే లేదన్న మాట.

## ఇస్లాం వ్యాప్తి వల్ల విజ్ఞాన శాస్త్రానికి ఎంతో మేలు చేకూరినది:

ఇస్లాం మనిషిలో ఆలోచన శక్తిని పెంపొందిస్తుంది. ఇస్లాం బోధనలు వ్యాపించుట వలన వివిధ ప్రాంతాల కలయిక ఏర్పడింది. తూర్పు పడమరలలో ఉన్నవారు కలుసుకొనుట వలన ఎన్నో విధానాలు బయటకు వచ్చాయి. సముద్ర ప్రయాణాలలో మెళుకువలు, కంపాస్లు విశ్వవిద్యాలయాలు, వైద్యవిధానాలు ఇలా ఎన్నో నూతన శాస్త్రాలకు ఇస్లాం పునాది అయినది. గణిత, భౌతిక, భౌగోళిక, ఖగోళ శాస్త్రాలకు ఇస్లాం వలన ఎంతో సహకారం లభించింది. సృష్టిరహస్యాలు కనిపెట్టే శాస్త్రీయ పరిశోధనలను ఎంతగానో ప్రోత్సహిస్తుంది. భవన నిర్మాణంలో మెళుకువలు కళాఖండాలు తయారు చేయటంలో చరిత్రలో దాగి ఉన్న విషయాలు ఇస్లాం ద్వారానే బయట పడ్డాయి. అల్ జీబ్రా అరబ్బీ అంకెలు, సున్నా దాని యొక్క విలువ ఇవన్నీ కూడా ఇస్లాం రాజ్యాల నుండే పాశ్చాత్య దేశాల వారు తెలుసుకున్నారు. ఈ పుస్తకం చివరిపేజీలో కొందరు ప్రముఖ ముస్లిం శాస్త్రవేత్తల పేర్లు ఇవ్వబడినవి.

## 19. ఖుర్ఆన్ లో జీసస్ (అ) గురించి .....

ముస్లింలు ఏసు (ఈసా) అలైహిస్సలాం ను చాలా గౌరవిస్తారు. ఆయన ప్రముఖ ప్రవక్తలలో ఒకనిగా నమ్ముతారు. ఏసు (ఈసా అలైహిస్సలాం) యొక్క తల్లి అయిన మేరి (మర్యమ్) ను పరమ పవిత్రురాలని ఖుర్ఆన్ గ్రంథం చెబుతుంది. ఆమె పేర ఖుర్ఆన్ లో ఒక అధ్యాయం కూడా అవతరించింది. ఏసు (ఈసా అలైహిస్సలాం) పుట్టుకను గూర్చి ఖుర్ఆన్ లో ఇలా చెప్పబడింది.

"దైవదూతలు ఇలా అన్నారు 'మర్యమ్! అల్లాహ్ తన ఒక ఆజ్ఞ కు సంబంధించిన శుభవార్తను నీకు పంపుతున్నాడు. అతని పేరు ఈసా మసీహ్. అతను మర్యమ్ కుమారుడు. అతడు ఇహపర లోకాలలో గౌరవనీయుడౌతాడు. అల్లాహ్ సామీప్యం పొందిన దాసుల లోని వాడుగా పరిగణింపబడతాడు. ఉయ్యాలలో ఉన్నప్పుడూ, పెరిగి పెద్దవడైనప్పుడూ ప్రజలతో సంభాషిస్తాడు. ఇంకా అతను ఒక సత్పురుషుడవుతాడు.' ఇది విన్న మర్యమ్ ఇలా అన్నారు 'ప్రభూ! నాకు శిశువు ఎలా జన్మిస్తుంది? నన్ను ఏ పురుషుడూ చేతితోనైనా తాకలేదే!' సమాధానం లభించింది అలానే జరుగుతుంది. అల్లాహ్ తాను కోరిన దాన్ని సృష్టిస్తాడు. ఆయన ఒక పనిని చెయ్యాలని నిర్ణయించినప్పుడు కేవలం దానిని 'అయిపో' అంటాడు అంతే అది అయిపోతుంది." (ఖుర్ఆన్ 3:45-47)

ఏసు (ఈసా అలైహిస్సలాం) ను తండ్రి లేకుండా పుట్టించిన అల్లాహ్ ఆదిమానవున్ని (ఆదమ్) తల్లిదండ్రులు ఇద్దరు లేకుండా సృష్టించాడు. ఈ విషయాన్ని ఖుర్ఆన్ లో ఇలా చెప్పబడింది "అల్లాహ్ దృష్టిలో ఈసా (యేసు) పుట్టుక ఆదమ్ పుట్టుక వంటిదే. అల్లాహ్ ఆదమును మట్టితో చేసి 'అయిపో' అని ఆజ్ఞాపించాడు. అతడు అయ్యాడు" (ఖుర్ఆన్ 3:59)

దేవుడు (అల్లాహ్) ఏసు (ఈసా అలైహిస్సలాం)ను తన ఏకత్వమును చాటుట కొరకు ప్రవక్తగా నియమించి పంపినాడు. అలానే ఆయనకు కొన్ని అద్భుతాలు చేసే శక్తిని కూడా ఇచ్చాడు. ఈ విషయమై ఖుర్ఆన్ లో ఇలా చెప్పబడింది – "ఇంకా అతనిని (ఈసా) ఇస్రాయీలు సంతతి వద్దకు తన ప్రవక్తగా పంపుతాడు. (ప్రవక్తగా ఇస్రాయీలు సంతతి వద్దకు వచ్చినప్పుడు ఇతను ఇలా అన్నాడు) "నేను మీ ప్రభువు నుండి మీ వద్దకు సూచనను తీసుకువచ్చాను. మీ ముందే నేను మట్టితో పక్షి ఆకారం గల ఒక బొమ్మను తయారుచేసి దానిలోనికి శ్వాస ఊదుతాను. అది అల్లాహ్ ఆజ్ఞతో పక్షి అవుతుంది. నేను అల్లాహ్ ఆజ్ఞతోనే పుట్టుగుడ్డిని, కుష్ఠురోగిని బాగు చేస్తాడు, ఆయన ఆజ్ఞతో మృతులను బ్రతికిస్తాను. ఇంకా మీరు ఏమేమి తింటారో మీ గృహాలలో ఏమేమి నిలువచేసి ఉంచుతారో కూడా మీకు తెలుపుతాను. మీరు విశ్వసించే వారే అయితే, వాస్తవంగా ఇందులో మీకు గొప్ప సూచన ఉంది." ఖుర్ఆన్ 3:49.

ఏసు (ఈసా అలైహిస్సలాం) పై ఖుర్ఆన్ ను చెప్పబడిన అద్భుతాలు చేసే దేవుని ప్రవక్త అని ముస్లింలు విశ్వసిస్తారు. అలానే ఏసు(ఈసా అలైహిస్సలాం) ను శిలువ వెయ్యలేదని ఆయనను దేవుడు తన వద్దకు ఎత్తుకున్నాడని ఆయనకు బదులు మరొకరిని యూదులు శిలువ వేసారని నమ్ముతారు. ఇదే విషయాన్ని ఖుర్ఆన్ లో చెప్పబడింది - స్వయంగా, "మేము మసీహ్, మర్యమ్ కుమారుడైన ఈసా అనే దైవ ప్రవక్తను చంపాము అని అన్నారు. వాస్తవానికి వారు ఆయనను చంపనూ లేదు. శిలుపైకి ఎక్కించనూ లేదు. కాని ఆ విషయంలో వారు భ్రమకు గురి చెయ్యబడ్డారు. ఈ విషయం గురించి భేదాభిప్రాయం వ్యక్తం చేసినవారు కూడా సందేహానికి లోనయ్యారు. దీనిని గురించి వారికి అసలు ఏమీ తెలియదు. వారు కేవలం ఊహనే అనుసరిస్తున్నారు. వారు అతనిని నిశ్చయంగా చంపలేదు. కాని అల్లాహ్ ఆయనను తన వైపునకు లేపుకున్నారు. అల్లాహ్ అద్భుత శక్తి సంపన్నుడు. అత్యంత వివేకవంతుడు" ఖుర్ఆన్ 4:157 – 158

ఏసు (ఈసా) దేవుని యొక్క ప్రవక్త అని ఆయన చంపబడలేదని ఆయనను దేవుడు తన వైపునకు లేపుకున్నాడని ముస్లింలు నమ్ముతారు. అంతేకాకుండా ఏసు (ఈసా) ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం రాక గురించి ముందే తెలియజేసారని ఖుర్ఆన్ లో మరియు బైబిల్ లో కూడా చెప్పబడింది.

మర్యమ్ కుమారుడు ఈసా అనిన మాటలను జ్ఞాపకం తెచ్చుకో, "ఓ ఇస్రాయీల్ ప్రజలారా! నేను మీ వద్దకు అల్లాహ్ చే పంపబడిన సందేశహరుణ్ణి; నాకు పూర్వం వచ్చిన తౌరాత్ గ్రంథాన్ని ధృవపరుస్తున్నాను;నా తర్వాత అహ్మద్ అనే ప్రవక్త రాబోతున్నాడు అనే శుభవార్తను అందచేస్తున్నాను" ఖుర్ఆన్ 61:6

యెహాను 16:6-7 : ఇప్పుడు నన్ను పంపిన వాని యొద్దకు వెళ్ళుచున్నాను – నీవు ఎక్కడికి వెళ్ళుచున్నావని మీలో ఎవడును నన్నడుగుట లేదు గాని నేను ఈ సంగతులు మీతో చెప్పినందుకు మీ హృదయము దు:ఖముతో నిండియున్నది. అయితే నేను మీతో సత్యము చెప్పుచున్నాను, నేను వెళ్ళిన యెడల ఆయనను మీ యొద్దకు పంపుదును.

## ఇస్లాం మరియు ఉగ్రవాదం

ఇస్లాం శాంతిసుఖాల మరియు ప్రేమానురాగాల నిలయం. ఇస్లాం ఎప్పుడూ హింసా దౌర్జన్యాలను సమర్థించదు.

ఎవరైతే ధర్మవిషయంలో మీతో యుద్ధం చేయలేదో, మిమ్మల్ని మీ ఇళ్ళ నుండి వెళ్ళగొట్టలేదో, వారి పట్ల మీరు మంచితనంతో, న్యాయంతో వ్యవహరించటాన్ని అల్లాహ్ నిరోధించడు. అల్లాహ్ న్యాయం చేసేవారిని ప్రేమిస్తాడు (ఖుర్ఆన్ 60:8)

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఇలా ఆదేశించారు. యుద్ధరంగంలో పాల్గొనే సైనికుల నుద్దేశించి మీరు శత్రువర్గంలోని చిన్నపిల్లలను, స్త్రీలను వృద్ధులను వధించరాదని ఆదేశించారు. బుఖారి, ముస్లిం.

మరో హదీథ్ లో - ఉద్రేకంలో చిన్న పిల్లలను చంపవద్దు అన్నారు . ముస్లిం, తిర్మిజి

మరో హదీథ్ లో - ముస్లింలలో ఎవరైనా సంధి కుదుర్చుకున్న తరువాత వారిని హత్యచేస్తే, వాడు స్వర్గంలో ప్రవేశించడు సరికదా స్వర్గానికి 40 సంవత్సరాల (ప్రయాణించే) దూరంలో ఉంటాడు, బుఖారి, ఇబ్నె మాజా

ఎవ్వరిని అగ్నికి ఆహుతి చెయ్యకండి అబూ దావుద్

అన్యాయంగా హత్యచేయడం ఘోరమైన పాపాలలో ఒకటి అన్నారు. బుఖారి, ముస్లిం.

తీర్పుదినం నాడు పాపాల లెక్కలు చూసేటప్పుడు ముందుగా హత్యలపై లెక్కతీసుకుంటాడు. బుఖారి , ముస్లిం హదీథ్ గ్రంథాలు.

ఏ ముస్లిం అయినా ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం బోధనలకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే అది ఇస్లాంకు సంబంధం లేదు. నేడు జిహాద్ పేరుతో చేస్తున్న కార్యకలాపాలకు మరియు ఇస్లాంకు

ఎట్టి సంబంధం లేదు. ఆనాడు యుద్ధాలలో పాల్గొన్న సైనికులను ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఈ విధంగా హెచ్చరించేవారు – శత్రువుల తోటలను నాశనం చెయ్యవద్దని వారి ఇళ్ళను ధ్వంసం చెయ్యవద్దు. మరి నేడు ఈ తీవ్రవాదులు చేస్తున్నదేమిటి?

**మనుషుల పట్లే కాదు జంతువుల పట్ల కూడా కరుణ చూపమన్నారు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం.**

ఒక స్త్రీ తన ఇంటిలో ఉన్న పిల్లిని కట్టి పడేస్తుంది. దానికి తిండి పెట్టక, తన ఆహారం సంపాదించుకొనుటకు విడిచిపెట్టక అలానే వదిలేస్తుంది. చివరికి ఆ పిల్లి ఆకలితో అలమటించి చనిపోతుంది. ఆ పిల్లి చావుకు కారుణమైన స్త్రీని అల్లాహ్ నరకానికి పంపుతాడు అని ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం అన్నారు బుఖారి, ముస్లిం.

మరో హదీథ్ లో - ఓ వ్యక్తి దాహంతో అలమటిస్తున్న కుక్కను చూసి, ఆ వ్యక్తి నూతిలో దిగి నీళ్ళు తెచ్చి ఆ కుక్క దాహాన్ని తీర్చాడు. ఇలా కుక్క దాహాన్ని తీర్చడం వలన స్వర్గంలో ప్రవేశించాడు ఆ వ్యక్తి అన్నారు. ఇది విన్న సహచరులు ఇలా అడిగారు ఓ ప్రవక్తా! జంతువులను కరుణించుట వలన మా పాపాలను క్షమిస్తాడా, మాకు బహుమానం ఇస్తాడా? ఆయన జవాబుగా ఏ ప్రాణిపైనైనా కరుణిస్తే అల్లాహ్ వారికి తప్పకుండా బహుమానం ఇస్తాడు. అని అన్నారు బుఖారి, ముస్లిం హదీథ్ లు.

మరో హదీథ్ లో - మీరు జంతువులను జిబా చేసేటప్పుడు దానికి తక్కువలో తక్కువ బాధ కలిగేలా చూడండి. జిబా చేసేటప్పుడు సరైన పద్ధతిని అనుసరించండి. జిబా చేయటానికి ఉపయోగించే కత్తి మంచి పదునైనదిగా ఉండేలా చూడండి. ఎందువలనంటే దాని గొంతు సులువుగా తెగుతుంది. దాని వలన ఆ జంతువుకు పెద్దగా బాధ కలుగకుండా ఉంటుంది. ముస్లిం, తిర్మిది హదీథ్ గ్రంథాలు.

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం యొక్క హృదయం, శత్రువులను సహితం క్షమించగల గొప్ప హృదయం. ముస్లింలకు ఆయన తన విధానాన్నే అవలంభించమని బోధించారు. అంతేకాని అమాయకులను, నిస్సహాయకులను, చిన్నపిల్లలను, స్త్రీలను, వృద్ధులను, చంపమని ఆయన ఏనాడూ బోధించలేదు. ఇలాంటి పనులు చేసేవారికీ, ఇస్లాంకు ఎటువంటి సంబంధం లేదు.

## 20. ఇస్లాం - మానవతాధర్మం

ఇస్లాం ధర్మం ప్రతి మానవుడి ధనమాన ప్రాణాలకు విలువనిస్తుంది. ఇస్లామీయ రాజ్యాలలో ఉండే ముస్లిమేతరుల విషయంలో కూడా వీటి రక్షణకు తగు ఏర్పాట్లు కల్పించబడతాయి.

ఇతరులను హేళన చేయడం, తక్కువ చేసి మాట్లాడటం వంటి పనులను ఇస్లాం వారిస్తుంది.

ఒకరి ధన మాన ప్రాణాలకు నష్టం కలిగించడం నిషిద్ధం చేయబడిందని ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం తెలియజేసిరి. బుఖారి, అహ్మద్ హదీథ్ గ్రంథాలు.

### వర్ణభేదానికి ఇస్లాంలో తావు లేదు.

"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగానూ, తెగలుగానూ, చేశాము. వాస్తవానికి మీలో అందరి కంటే ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు నిశ్చయంగా అల్లాహ్ సర్వలోకజ్ఞానం కలవాడు, సకల విషయాలు తెలిసిన వాడూనూ." ఖుర్ఆన్ 49:13.

దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం ఇలా అన్నారు. "మీ అజ్ఞాన అహంకారాలను, తాతముత్తాతల మీద గర్వించే తత్వాన్ని అల్లాహ్ అంతమొందించాడు. మనిషి విశ్వాసి, దైవభీతి గలవానిగానో లేదా హీనమైన దురాచారిగానో రూపొందుతాడు. సర్వమానవులూ ఆదం సంతానం. ఆదం మట్టితో సృష్టించబడ్డారు." తిర్మిది హదీథ్ గ్రంథం.

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఇలా ఉపదేశించారు - "ఓ జనులారా! మీ ఆరాధ్యుడు ఒక్కడే. మీ తండ్రి (ఆదం) ఒక్కడే. అరబ్బువాడి కన్నా అరబ్బేతరుడేమి గొప్పవాడు కాదు. అలానే అరబ్బేతరుని కన్నా అరబ్బువాడు గొప్పవాడు కాదు. తెల్లవాడి కన్నా నల్లవాడు, నల్లవాడి కన్నా తెల్లవాడు గొప్పవాడు కాదు. అల్లాహ్ దృష్టిలో ఆయన పట్ల భయభక్తులు కలవారే ఉత్తములు." అహ్మద్ హదీథ్ గ్రంథం.

ఇస్లాంకు పూర్వం అజ్ఞాన కాలంలో ప్రజలు జాతిదురభిమానా లతో కొట్టుమిట్టాడేవారు. వారి దృష్టిలో వంశం, జాతి ఔన్నత్యమే మానవ శ్రేష్ఠతకు ప్రమాణం. ఇది వారిలో అహంకారం, గర్వం లాంటి భావనల్ని జనింపజేసింది. వారి సంస్కరణలో ఆటంకంగా పరిణమించింది. యూదులు కూడా జాతి దురహంకార రుగ్మతకు గురైె ఉన్నవారే. ఫలితంగా వారు కార్యశూన్యులుగా రూపొందారు. ఈ అజ్ఞాన భావనల్ని మిధ్యగా, మహానీచమైనవిగా ఇస్లాం అభివర్ణించింది. మానవులంతా సమానమేనని, మానవుడు తన

చెడు ప్రవర్తన వల్ల చెడ్డవాడుగా సత్ప్రవర్తన వల్ల మంచివాడుగా రూపొందుతాడని స్పష్టపరిచింది. గౌరవానికి ప్రమాణం వంశం, గోత్రం కాదని, అల్లాహ్ పై విశ్వాసం మరియు భయభక్తులు, శీల సంపత్తి మాత్రమే గౌరవాదరణలకు, శ్రేష్ఠతకు ఆధారాలని తెలిపింది. మనిషి ఏ వంశానికి చెందిన వాడయినను అతనిలో అల్లాహ్ పై విశ్వాసం, అల్లాహ్ పట్ల భయభక్తులు కలిగి ఉండి, ఆయన ఆదేశించినట్లుగా జీవించే మానవుడే ఉత్తముడని, గౌరవనీయుడనీ ఇస్లాం స్పష్టం చేసింది. దైవ ప్రవక్త ఇలా ఉపదేశించారు - ఓ జనులారా! అన్యాయం చేయడం నుండి దూరంగా ఉండండి. అది మీకు తీర్పుదినం నాడు చీకటిలోనికి నెట్టివేస్తుంది. బుఖారి, అహ్మద్ హదీథ్ గ్రంథాలు.

మరో హదీథ్ లో - ఎవరికైతే ఇహలోకంలో న్యాయం జరగలేదో వారికి తీర్పు దినం నాడు అల్లాహ్ న్యాయం చేస్తాడు. వారి హక్కులను వారికి ఇప్పిస్తాడు తిర్మిది, ఇబ్నె మాజా హదీథ్ గ్రంథాలు.

ఎదుటి మనిషిని గౌరవించడం తన వల్ల వారికి ఎలాంటి ఇబ్బంది కలుగకుండా చూడడం ప్రతి ముస్లిం ధర్మం. బుఖారి హదీథ్ గ్రంథం.

దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం ఇలా ఉపదేశించారు. అల్లాహ్ మీ రూపురేఖల్ని, ధనసంపత్తులను చూడడు. ఆయన మీ సంకల్పాన్ని మరియు మీ ఆచరణలను చూస్తాడు ముస్లిం హదీథ్ గ్రంథం.

ముస్లింలు నమాజు చేసేటప్పుడు మరియు హజ్ యాత్ర చేసేటప్పుడు వారిని గమనించినట్లయితే అందులో మనకు కనిపించేది కేవలం సమానత్వం మాత్రమే. అక్కడ గొప్పవాడు, బీదవాడు అను భేదం అస్సలు కనిపించదు. వర్ణ వివక్షతకు తావేలేదు. ధనికుల ప్రక్కన బీదవాడు, నల్లవాడి ప్రక్కన తెల్లవాడు ఇలా ఎలాంటి వ్యత్యాసం లేకుండా అక్కడ అందరూ సమానంగా ప్రవర్తిస్తారు. సాటి మనిషికి కష్టం కలిగించే వస్తువును సహితం అడ్డు తొలగిస్తే అల్లాహ్ దృష్టిలో గౌరవింపబడతారని ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం తెలిపిరి.

ఓ వ్యక్తి దారిన నడుస్తున్నాడు. మార్గం మధ్యలో అతడు ఓ ముళ్ళకంపను చూసాడు. దాన్ని అతడు దారిలో నుండి తొలగించాడు. అతడు చేసిన ఆ పనిని అల్లాహ్ గౌరవించి, అతణ్ణి కటాక్షిస్తాడు. ముస్లిం హదీథ్ గ్రంథం.

మరో హదీసులో - దైవప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం ఇలా బోధించారు – అన్నార్తులకు భోజనం పెట్టు, రోగిని పరామర్శించు, ఖైదీని విడిపించు (బుఖారి హదీథ్ గ్రంథం)

ఇస్లాం ఓ ప్రత్యేకమైన సౌశీల్యతను నిర్మించాలని కోరుతుంది. అందులో సానుభూతి, బాధల్లో పాలుపంచుకోవడం సహాయ సహకారాలు అందించడం ప్రధాన లక్షణాలు. ఇతరుల్ని కష్టాల్లో

ఆదుకోవాలి, వారి బాధను తన బాధగా భావించాలి. ఈ సానుభూతి దయాగుణాలు బాధాగ్రస్తుడైన ప్రతి వ్యక్తి పట్ల వ్యక్తమవ్వాలి. తన వారైనా, పరాయివారైనా, ఏ మతం వారైనా, ఏ జాతి వారైనా అందరి పట్ల ప్రదర్శించాలి. ఆకలి గొన్న వారికి అన్నం పెట్టడం, ఆకలి దప్పుల్ని దూరం చెయ్యడం ఇస్లాం ఆశయాల్లోని ఒక ప్రముఖ అంశం. రోగిని పరామర్శించడం అంటే యోగక్షేమాల విచారణతో పాటు రోగికి పరిచర్యలు కూడా చేయాలి. ఖైదీని విడిపించడం అంటే నేరం చేయని అమాయకులు జైలు పాలైతే వారిని విడిపించడానికి ప్రయత్నించాలి.

ఇవే కాకుండా ఇస్లాం మరెన్నో విషయాలు, నియమాలు నిబంధనలు తెలియజేసింది. వాటిని తెలుసుకోవాలంటే ఖుర్ఆన్ చదవండి. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం యొక్క ప్రవచనాలు చదవండి. నేడు మన మధ్య ఉండే ముస్లింలను చూచి ఇస్లాం గురించి అంచనా వేయకండి. స్వచ్ఛమైన ఖుర్ఆన్ లో మరియు హదీథ్ లలో ఉన్నదే నిజమైన ఇస్లాం ధర్మం.

ఓ అల్లాహ్! ఇహపరలోకాలలో సాఫల్యాన్ని చేకూర్చే మరియు నీవు ఇష్టపడే సన్మార్గము పైనే మమ్మల్ని నడిపించుము!

## 24. కొంతమంది ప్రముఖ ముస్లిం శాస్త్రవేత్తల పేర్లు

1) అల్ ఖరిజీ 180 – 232 హి (795 – 847 క్రీ.శ.) అల్ జిబ్రా, రేఖాగణితం, త్రికోణమితి.
2) అల్ రజి 251–313హి (865–925) వైద్యశాస్త్రం, రసాయన శాస్త్రం.
3) అల్ ఒట్టాని 264 – 306హి (877 – 918) భూగోళశాస్త్రం
4) అల్ ఫరాజ 259- 339హి (872 – 950) ఫిలాసఫీ, పొలిటికల్ సైన్స్
5) ఇబ్నె బైతార్ 586–646హి (1190-1248) వృక్షశాస్త్రం, ఔషధశాస్త్రం
6) ఇబ్నె మాజిద్ 835–906హి (1432–1500) సముద్రయాన శాస్త్రం, మహాసముద్రమునకు దారి
7) అహ్మద్ లహోరి 999–1059హి (1591–1649) భవన నిర్మాణం, తాజ్ మహల్
8) అల్ జజారి 550 – 602హి (1155 – 1206) మెకానికల్ విభాగం
9) అల్ కాజని 515 హి – (1121 - ) మెకానికల్ హైడ్రోస్టేటిక్స్
10) ఇబ్నె అల్ క్లైఫ్ 630–685హి (1233–1286) సర్జరీ, ఫిజియోలజీ
11) అల్ షహ్ రస్తాని 469–548హి (1076–1153) కంపేరిటివ్ రిలిజియన్
12) అదుల్ ఫజల్ 958–1002హి (1551–1599) స్టేట్ ఎడ్మినిస్ట్రేషన్, హిస్టరీ
13) ఎబ్రిముదబ్బిర్ 552–628హి (1157–1231 ) యుద్ధనైపుణ్యత, యుద్ధ సామగ్రి
14) ఇబ్నెఅల్అవ్వామ్1050–1650అగ్రికల్చర్, యానిమల్ హస్బెండరీ
15) ఇబ్నె బతూత్ 703హి (1304) ట్రావెల్ మరియు హిస్టరీ.

సేకరించిన పుస్తకం – 1000 ముస్లిం సైంటిస్టుల పేర్లు.